" ప్రేమపూరితహృది ప్రియునితో దాను
తాదాత్మ్యముం జెంద తపియించుచుండ
ప్రతిరాత్రి నిన్నెడబాసి వియోగ
జలధిలో ముంచు ప్రచండు డటంచు
నెఱిగియు లెక్కింప కెప్పుడు నిను ని
దర్శనభాగ్యమే తరియించు ననుచు
మోమెల్ల వికసింప మురియుచుండెదవు
పద్మమా ! నీ దివ్య ప్రణయార్థమెల్ల
లలితహృదయులకే లభియించునేమొ ? "




## ధర్మశాస్త్రములు — స్త్రీ హక్కులు

హిందూ ధర్మశాస్త్రముల ప్రకారము హిందూస్త్రీలు కొన్నిహక్కులు కొన్నియధికారములు మాత్రము పొందియున్నారు. వారు సంఘమున మెలగవలసిన విధానము పెక్కునియమములపై నాధారపడియున్నది. ఈనియమములు నిబంధనలు కాలముమారినను, సామాజమునందు సంపూర్ణమగు మార్పుగలిగినను, తుదకు స్వార్థపరులై పురుషులు తాము నడచుకొనుటకు హిందూధర్మశాస్త్రములు విధించిన నియమములకు వ్యతిరేకముగ ప్రవర్తించుచు స్త్రీలు మాత్రమట్లు వర్తింపకూడదనియు పట్టుబట్టునపుడును, నొకేరీతిగా నుండవలయునని యాధర్మశాస్త్రనిర్మాతల యాశయమేమో తెలియదు గాని నేటి సమాజమునందది కొందరి యభిప్రాయమైయున్నదని చెప్పుటకు నిదర్శనము లెన్నియేని కనబడుచున్నవి.

చాలమంది తమ విషయములందు ధర్మసూత్రములమాట దడవరు. స్వార్థచింత యెక్కువ; నూతనత్వముపై ప్రియము మిక్కుటము కాని స్త్రీలయెడ మాత్రమిదేమియు నుండరాదు. వారు ధర్మశాస్త్రముల ప్రకారమెపుడును నడచుకొనవలసినదే. తమ నిరంకుశత్వమును చవిజూచుచు నుండవలసినదే. వారటు లంగీకరింపక పోయిరేని, తమ చేతగానిచో చట్టసాహాయమును బొందియైన స్త్రీలను ధర్మశాస్త్రముల ప్రకారము నడచుకొన జేయవలయునని పురుషులు భగీరథ ప్రయత్నములు చేయుచుందురు. హిందూ ధర్మ

శాస్త్రముల నాధారముగా జేసికొని నిర్మింపబడిన చట్టములు మాత్రము స్త్రీల కేవిధమున తోడ్పడగలవు? అందుచేతనే దుర్భరకష్టములకు లోనయ్యు స్త్రీలు కిక్కురుమనకుండ నూరకుండుట. కాని చట్టములను చక్కగ నవగాహన మొనరించుకొని ధర్మశాస్త్రముల ప్రకారమని జరుగు అన్యాయములను గురించిన న్యాయమూర్తు లొకవిధముగా దోడ్పడగలుగుదురు. దీనికి నిదర్శనముగ నిటీవల న్యాయమూర్తుల దృష్టియందు బడిన భార్యనుభర్తకొట్టు నధికార మున్నదా లేదా మొదలగు కొన్ని కేసులను, చదువరు లిదివఱకు గమనించియుందురు. వీనియందెల్ల న్యాయాధికారులు నిష్పక్షపాత దృష్టితో పురుషుల నిరంకుశత్వమును గర్హించుచు తీర్మానించిరి. ఇపుడు క్రింద వ్రాయబోవు కేసుకూడ నిట్టిదే. పురుషులు తమ ధర్మముల గురించక స్త్రీలు హిందూ ధర్మశాస్త్రములనే యనుసరింపవలయుననెడి దానియందుగల యన్యాయమును, ఆవిషయములందు చట్టమునకుగల శక్తి హీనతయు, దయాదాక్షిణ్యాది గుణములుగల విశాల హృదయులు న్యాయము నేవిధముగ ప్రసాదింపగలుగుసదియు నీ కేసునందు స్పష్టమగుచున్నది.

ఈశ్వరరావు అనంతపురవాసి. అతడు తన ప్రథమభార్యయగు శాంతమ్మ తనతో కూడనుండునటులచేయు దాంపత్యహక్కును అమలు జరిపింపవలయుననుచు అనంతపురము జిల్లామునసబుకోర్టులో దావాదెచ్చెను. అపుడు ప్రతివాదియగు శాంతమ్మ తనచరిత్ర నీవిధముగ కోర్టులో దెలుపుకొనెను. ఆమె ఈశ్వరరావును వివాహమాడి ఏడెనిమిదిసంవత్సరము లాతనితో సౌఖ్యముగ కాపురము చేసెను. తరువాత నాతడు వేరొకయువతిని వివాహమాడెను. రెండవభార్యను గూడి యాతడు శాంతమ్మను బాధింపజొచ్చెను. వారుపెట్టు బాధలనన్నియు భరించి యామె రెండుసంవత్సరములకాలము వారివద్దనే యుండెను. కాని 1922 వ సంవత్సరమున వాదియగు ఈశ్వరరావు ఆమెను యిలు వెడలగొట్టెను. ఇంతవఱకామె వేరుగనే నివసించుచుండెను. ఇపుడు మనువర్తి యిచ్చుట దప్పిపోవునను యుద్దేశ్యముతో వాది శాంతమ్మను తనయింట నుండవలయునని కోరుచుండెననియు, నామె యాతని కోరిక ననుసరించి యాతనియొద్ద కేగిన మెప్పటివలె నిరాదరించి బాధలుపెట్టుననియు, కావున నాకీతిపోవుటకు వాది కనుకూలముగ కోర్టువా రుత్తరువు గావింపకూడదనియు శాంతమ్మ మనవిచేసెను. కాని కోర్టువారా విన్నపమును ద్రోసిపుచ్చి వాదికోరిన ప్రకార ముత్తరువుల గావించిరి.

శాంతమ్మ గా రంతట శాంతింపలేదు. జిల్లాకోర్టునందు అపీలుగావించెను. అప్పటి జిల్లాజడ్జిగారగు పంచాపకేశయ్యరుగారు కేసును విచారించి ప్రతివాదియొక్క ఆరోగ్యము పూర్తిగా చెడిపోయినదనియు, వాదియగు ఈశ్వరరావు కామెపై యనురాగ మొంతమాత్రమును లేదనియు, ఆమె

వచ్చి తనతో కాపురము చేయవలయుననెడి కోరిక అతనికి నిజముగ లేదనియు, ఆమెకు మనువర్తినొసగు బాధ్యతను తప్పించుకొను నుద్దేశముతో మాత్రము తానాదావా తెచ్చియున్నాడనియు నిర్ణయించెను. కాని అచట హిందూధర్మములు చట్టమున కెదురు తగిలి నిలిచెను. అందుచే వారు భార్య అనారోగ్యముచే బాధపడుచున్నంతమాత్రమున భర్తతో నుండ నిరాకరించుటకు కోర్టున కధికారము లేదని అభిప్రాయపడి క్రింది కోర్టు తీర్పునే ఖాయముచేయుచు అప్పీలును త్రోసివేసిరి. హిందూధర్మ సూత్రములపై నాధారపడి ఇట 'కంచెయే చేనుమేసినది.' జడ్జిగారు కొంతదయను జూపుచు తమ తీర్మానములో ప్రతివాది తనభర్తతో వసింపనిచో మనువర్తి పొందు హక్కుమాత్రము గోల్పోవునుగాని మరెట్టినష్టమునకు లోనుగాదని తెలిపిరి.

శాంతమ్మ యీతీర్పు నంగీకరింపక హైకోర్టునందు మరల అప్పీలు గావించెను. న్యాయమూర్తులగు వర్డ్స్వర్తుగారు అప్పీలును విచారించి క్రింద కోర్టు తీర్మానమును రద్దుగావించి యుభయపక్షములను విచారించి యవసరమగుచో మరల నొక తీర్పు వ్రాయవలయునని మరల కేసును క్రింది కోర్టునకు బంపిరి. వారి తీర్మానములో "ఈ కేసుయొక్క పరిస్థితులలో ప్రతివాదిని భర్తవద్దకు పంపుట యామె యారోగ్యమునకు భంగకరము ఔనా కాదా యను విషయమును స్పష్టముగా జడ్జి తెలిపియుండవలెను. మరియు ప్రతివాది నామె భర్తవద్దకు పంపినచో నాతనివలన క్రూరచర్యలకుగాని బాధలకుగాని నిరాదరణకుగాని గురిచేయబడెడిదా? అందువలన నామె జీవితమున కెట్టియాటంకములు గలుగును? అను విషయములను జిల్లాజడ్జి తనయెదుటనున్న సాక్ష్యముంబట్టి సరియగు నిర్ణయము చేసియుండవలసినది. ఆమె యిట్టి యపాయమునకు గురియగునన్న ననుమానమున్నచో వాది కోరికను నిరాకరింపనగును. అట్టి యనుమానమున కాధారము గన్పింపనిచో వాదికనుకూలముగ నుత్తరువు గావింపవలయును. ఆమెను భర్తవద్దకు పంపినచో నామె యారోగ్యమునకు సౌఖ్యమునకు భంగము గలిగి యామె యకాలమరణమునకు బాల్పడునని కారణములు గన్పించిన హిందూలా ప్రకారము భార్య భర్తయెడ నేవిధముగ ప్రవర్తింపవలసియున్నను కోర్టువారు మాత్రము భర్త కట్టి దాంపత్యపు హక్కును అమలుజరుపుకొనుటకు ఉత్తరువుల గావింపకూడదు. అట్టి అపాయములు నిజముగ లేకున్నను నామె యావిధముగ నారోపణల గావించెనేని భర్త కనుకూలముగ నుత్తరువు గావించుటకు కోర్టు నిరాకరింపజాలదు. ఏలన భర్త ద్వితీయవివాహము గావించుకొన్నను తగిన కారణములున్నగాని భర్తనువదలి వేరుగా నివసింపకుండుట హిందూపత్నియొక్క విద్యుక్త ధర్మము" అని వ్రాసిరి.

వారి యుత్తరువుప్రకారము అనంతపురముజిల్లా సెషన్సుజడ్జియొద్దకు కేసు

విచారణకు వచ్చెను. జడ్జిగారగు రావు సాహేబు సి. సత్యనారాయణ చౌదరిగారు కేసు విచారించిరి. వారి తీర్మానమిది. "ఈ కేసునందు హిందూభార్య తన భర్త మరియొక స్త్రీనిగాని, స్త్రీలనుగాని వివాహమాడినను అతనితోడనే నివసింపవలయునని వాదింపబడెను. నిజమె. ఏజాతియందును భార్య భర్తతో వసించుట స్వధర్మమే కాని యీదావా భార్యకు వ్యథగలిగింపవలెననెడి యభిప్రాయముతోను దురుద్దేశముతోను చేయబడినది. ఈ యిరువదవ శతాబ్దమునకూడ హిందూస్త్రీలను కేవలము పశుసంపదక్రింద పరిగణించుట కొక పరిమితి యుండవలయును. హిందూధర్మశాస్త్రములపేరట యీకేసునందు పరిస్థితుల ననుసరించి భార్యకు ప్రతికూలముగ భర్తపరము తీర్మానముగావించుట న్యాయస్థానాధికారముల దుర్వినియోగ మొనర్చుట యగును. హిందూధర్మశాస్త్రములు స్త్రీలకు పశువులకంటె నెక్కువ ప్రతిపత్తి నొసగుటలేదను వాదనతో నే నంగీకరింపను. హిందూశాస్త్రానుసారమె హిందూసంఘమునందు స్త్రీలు తమ గృహములందు రాణీలవలె సమస్త స్వాతంత్ర్యముల ననుభవించుచుండిరనియు, ఆధునిక నాగరికజాతులందరివలె హిందూసంఘమునకూడ సమస్త స్వాతంత్ర్యములను అధికారములను సౌఖ్యములు ననుభవించుచున్నారనియు నేను స్వయముగ నెఱుగుదును. ఎంత హిందూవనితయైనను, ఇతర స్త్రీలవలెనే తనకు కూడ తనభర్తహోదాకు తగినరీతి కనీస సౌకర్యములు, ప్రేమాదరణములు గన్పరుపబడిననే కాని పతితో నివసింపమని నిర్బంధింప వీలులేదు. ఈకేసునందు ప్రతివాది వాది కట్టి సౌకర్యములు గలిగించునను నమ్మకము నా కెంతమాత్రములేదు. అంతియగాక ప్రతివాది గృహమునకు వాది వెళ్లుచో పై సౌకర్యములు లేకపోవుటయగాక విపరీతస్థితికి బాల్పడి, భర్తచే అనాదరణకు, బాధలకు, క్రూరచర్యలకు గురియై సౌఖ్యమును గోల్పోయి, అనారోగ్యమెక్కువై ప్రాణాపాయమును బొందునని నా యభిప్రాయము." కావున వాది దావాను గొట్టివేసి ప్రతివాది శాంతమ్మకనుకూలముగా నుత్తరువుగావించిరి.

న్యాయమూర్తు లిట్టి యన్యాయముల స్పష్టముగ గుర్తించినపుడు హిందూధర్మశాస్త్రముల పేరట జరుగు ససంగతము దిలకించినపుడు బాధితులగు వ్యక్తులకు సాయము చేయవలసిన బాధ్యత వహింపక తప్పదు. చట్టసాయముతో దుర్భరస్థితియందు తమ్ము బంధించి బాధపెట్టుచున్న యీ ధర్మసూత్రముల కొంతవఱకు విడిపించుకొననగును. దానికి న్యాయమూర్తులే తగురీతి సాయపడగలరు. పురుషులు తాముచేయు చేష్టలను ధర్మశాస్త్రముల దృష్టితోజూడక స్త్రీల విషయములందు మాత్రే పట్టి పట్టుదలజూపినపుడంతయు సత్యనారాయణ చౌదరిగారివంటి న్యాయాధిపులు వారికి తోడ్పడక తగినపాఠమును గరపుట సమంజసము; శ్రేయోదాయకము.

# స్త్రైణ శిక్ష

ఆచార్య కాకాకాలేల్కరు

స్త్రీల్ని అబలలంటారు. స్త్రీలూ ఈ పేరు అంటే అభిమానిస్తున్నట్టు తట్టుతుంది. ఈశ్వరుడు స్త్రీల్ని అబలలుగా ఉంటానికే పుట్టించాడా? కాదు. కాని లోకులు ఈ భావంతో ఏకీభవిస్తారని హామీపడటం దుస్సాధ్యం. మనం ఆడపిల్లలకు చిన్నప్పట్నుంచీ స్త్రీలు స్త్రీలే, పురుషులు పురుషులే, స్త్రీలు అస్వతంత్రులు అని బోధిస్తాం. అనాథస్త్రీలు, విధవలు, అంతులేని దుఃఖాలకు పాలౌతున్నారు. దీనికి కారణం వాళ్ళకు పతి అంటూ లేకపోవటమే. వీళ్ళు ఎక్కడికన్నా బయటిఊళ్ళకు యాత్రకోసం కాని వెళ్ళవలసివచ్చినా ఒంటరిగాపోగూడదు. వీళ్ళలో ఒక కాపలావాడంటూ ఉండాలి. కర్మంజాలక ఏస్త్రీఅయినా ఒంటరిగా పోతున్నదా, అదుగో అదుపులేనిది అని అంటమే కాకుండా ఇలా ప్రవర్తించడం కొంపకు చేటంటారు. "నస్త్రీ స్వాతంత్ర్యమర్హతి" అంటే స్త్రీకి ఒక కాపలావాడు ఉండాలి. ఎందుకంటే అది అబల కాబట్టి. ఈవిధంగా రకరకాల భావాలు మనలో వేరుపాతుకపోయినై.

జంతువులు, పక్షుల్లోకూడా స్త్రీజాతికి చెందినవి ఉంటై. కాని వీటిని అబలలు అని అనం. అవి స్వాతంత్ర్యానర్హం కూడా కావు. అవే తన పిల్లల్ని పోషించుకుంటై. ఇతర చోట్లకుపోయి ఆహారం తెచ్చుకున్నా వాటిని అదుపులేనివంటానికి వీలులేదు. ఎంతచెప్పినా స్త్రీకే తనమీద నమ్మకం లేదు. అంటే ఇది స్త్రీదోషం కాదు. ఇది పురుషుడు స్త్రీకి ఇచ్చిన శిక్షాఫలితం. దోషంఅంటే స్త్రీ దీన్ని అంగీకరించటమే? ఈ స్త్రైణశిక్ష మనలో నాటుకుపోయింది. తత్ఫలితంగా ఇవ్వాళ సగముదేశం అజ్ఞానావస్థకు గురై, నిర్జీవమై, భారరూపంగాఉంది.

బోధకుడు తను బోధించిన బోధనకు గురిఅవటం ప్రకృతి నియమం. అంటే తాను నేర్పిన విద్య తాను అలవరచుకుంటాడు. అందుకనే స్త్రైణశిక్ష వ్యాపకం చేసినవాళ్ల బుద్ధులు కాలాంతరాన స్త్రైణం అయిపోయినై. ఇదో వింతగాదు. 'నస్త్రీ స్వాతంత్ర్యమర్హతి' ఇది పండితవాక్యం. కొన్నాళ్ళకి ఈ పండితకోటే స్త్రైణభావానికి గురై మరో స్త్రైణసూత్రం ఉత్పత్తిచేసింది. "అనాశ్రయా నశోభన్తే పండితా, వనితా, లతా." ఈవ్రాత స్త్రైణశిక్షాఫలితం. తత్ఫలితంగా కష్టపడకుండా కూడుగుడ్డ దొరకాలని అసిస్తున్నాం. ఈనాడు యువకులు "భరణం"కోసం మురుస్తున్నారు. పిల్లలకేకాక పెద్దలకు పఠానులంటే భయం. ఉన్మత్తులై చరించే మాపలాలను చూచి మనం తెల్లవాళ్ళ ఫిరంగులను ఆహ్వానిస్తున్నాం. ఇదంతా స్త్రైణశిక్షాఫలం కాదు? ఏదన్నా ఇది గతవిషయం.

ఈనాడు స్త్రైణశిక్ష ఒకవిధంగా నశిస్తున్నది. ఈనాడు "భరణం" కాక చెమట ఓడ్చి దొరకినగంజే మృష్టాన్నమని భావించ మొదలుపెట్టారు. పఠానుల్ని, మాపలాల్ని తమ సోదరులని భావిస్తున్నారు. దుండగుల దుండగాన్ని సోదరభావంచే జయించాలని ప్రయత్నిస్తున్నారు. మన సంస్కృత కావ్యాల్లో మేఘాలు గర్జిస్తే స్త్రీలు "త్రాహిమామ్ త్రాహిమామ్" అంటు దాపునఉన్న యువకుని ఆశ్రయించేవాళ్ళు అన్న మోస్తరు వర్ణనలు ఎన్నో ఉన్నై. ఈ స్త్రైణభావం కారణాన యువకులు, స్త్రీలు క్రుద్ధులైనప్పుడు వాళ్ళ క్రోధం ఉపశమించడానికి మేఘం గర్జిస్తే బాగుంటుందనుకునేవాళ్ళు. ఇప్పుడు మన ప్రభుత్వం అశక్తులయిన అసహాయవాదులను లొంగతీయటానికి ఈదేశంలో మాపలా పితూరీవంటి పితూరీలు జరిగితే బాగుంటుందని తలుస్తారు. అంటే వాళ్ళకు స్త్రైణశిక్ష అబ్బిందన్నమాట. లేకపోతే మాపలా పితూరీలవంటి పితూరీలు రాజ్యరక్షణకు రామబాణాలుగా ఎందుకు భావిస్తారు? మన వాళ్ళు అనేకులు ఈ పితూరీల్నించి విదేశీయులే రక్షిస్తూ ఉండాలని కోరుకోవటం స్త్రైణభావం. స్త్రైణభావం ఉన్నంతవరకు స్వరాజ్యప్రాప్తి సంకల్పము స్త్రైణంగానే ఉంటుంది.

స్త్రైణశిక్షకు శ్రమంటే గిట్టదు. స్త్రైణశిక్షణ విపత్తి కావాలని కోరదు. విలాసం స్త్రైణశిక్షకు ఆప్యాయం. ఇంతకు చెప్పేదేమిటంటే స్త్రైణశిక్షాప్రచారం ఉన్నన్నాళ్లు తపస్సు (పరిశ్రమ) యజ్ఞం (త్యాగం) లేకుండా ఉన్నదాంతో సంతోషించే ఉంటం కలుగుతుంది. ఇది ఉన్నన్నాళ్ళు క్షణిక స్వార్థం వ్యాపకంగా ఉంటుంది. పురుషార్థం మటుమాయమౌతుంది.

స్త్రైణ స్వభావం అంటే స్త్రీ స్వభావం కాదు. ఈనాడు మన దేశంలో స్త్రీలు తపం, యజ్ఞం చేస్తున్నారు. నిజానికి పురుషుల్లోఉన్న సంయమం ఉంటే (నిగ్రహశక్తి ఉంటే) యేనాడో స్వరాజ్యం దక్కేది. స్త్రీస్వభావం తేజమంతగా ఉంటుంది కాని స్త్రైణస్వభావం నిస్తేజం.

స్త్రైణశిక్షను వీడడం సాధ్యం. కాని స్త్రైణశిక్ష కారణాన ప్రాప్తించిన స్త్రైణ స్వభావాన్ని వదలడం దుస్సహం. ఈనాడు చదువు పూర్తికావడంతోనే ప్రతివ్యక్తి "కెరియర్" ప్రాప్తించాలని కాంక్షిస్తాడు. కాంక్షించడం తప్పుకాదు. కాని అలవర్చుకోటం దుర్లభం. "కెరియర్" పురుషం, స్త్రైణం అని రెండువిధాలు. మహాత్వకాంక్ష, ఆర్జించి వెచ్చించేశక్తి, కష్టాల్లో బలిదానమై నిరతిశయానందం పొందే స్వభావం, అమరకీర్తి పొందు కాంక్ష, పురుష "కెరియర్"కు లక్షణాలు. తనువు వీడనీ ఆత్మగౌరవం పోగొట్టుకోకుండడం, దారిద్ర్యంపొందనీ గౌరవం కాపాడుకోటం, చెమట ఓడ్చనీ, అన్యాక్రాంతంగా భుజించ

కుండటం పురుషలక్షణం. ఈనాడు విద్యార్థులు పత్తి ఏకటంకంటే టైపురైటరు, దారంతీయటంకంటే చీట్లపేక, గుడ్డ నేయటంకంటే వ్యాఖ్యానాలు, చేయటానికి లేదా గుమాస్తాలవటానికి తయారౌతారు. దీనికంతా స్త్రైణశిక్షే కారణం.

ప్రస్తుతం మన శిక్షలో ఎంతో మార్పు కలగాలి. పరిశ్రమ చేయలేనివాడు శిక్షార్థి కాకూడదు. కూలివాడు కాజాలనివాడు పండితుడవటానికి ప్రయత్నించకూడదు. శిక్షార్థి విద్యార్జనకోసం వెచ్చించవలసింది డబ్బుకాదు శ్రమ. విద్యార్థులు మానవ సంఘంమీద ఆధారపడి డబ్బుతీసుకోవచ్చు కాని తనపని తను చేసుకునే శక్తిగలిగి ఉండాలి. సంఘంమీద భారంఉంచటం తప్పుకాదు కాని, గురువుభారం వహించటానికి శక్తి కలిగిఉండాలి. మానవులు పొందిన శిక్షనుబట్టి అనేక రుచులు గలిగి ఉండొచ్చు. కాని కష్టంలేని జీవనం గడపాలని అనుకోటం అపాయకరం. ఎందుకంటే ఒడుదుడుకుకు, అపాయం జీవితరహస్యం. విఘ్నాల్ని ఎదుర్కోటమే నిజమైన శౌర్యం, నిజమైన పురుషార్థం.

(అనువాదకురాలు: దొడూరి కమలాదేవి)



## తెనుగుబిడ్డా లెమ్ము

శ్రీమతి జంధ్యాల సుందరీదేవిగారు

తెనుగుబిడ్డా ! లెమ్ము తెలివి తెచ్చుకొని
తెనుగుబిడ్డా లెమ్ము తెఱవు చూచుకొని
తెనుగుభాషాసేవ తెఱవు యోచింపు
పండ్రెండుజిల్లాలు బఱగు దేశంబు
తెనుగుదేశముగాదె దెలుసుకొననెంచ
తెనుగుప్రజలకు బ్రతుకు తెఱవు లేదాయె
తెనుగురాష్ట్రమునుండి తఱలు ప్రజలెల్ల
రాష్ట్రేతరంబులలోఁ దలదాచుకొనగ
యెన్నోయిక్కట్టులను బొందుచుండిరిగ
దాసానదాసులై దిరుగుచుండిరిగ
ఎక్కడికేగినను నొక్కబొందెదరు
దిక్కుమాలిన బ్రతుకు. వెక్కసంబాయె
దక్షిణాఫ్రికాబోవ తఱుము వత్తురుగ
కనడాకుబోయిన కసరిగొట్టెదరు
మారిషస్ దీవిలో మానంబులేదు
ఆస్ట్రియామనకు అవమానమాయె
శస్త్రంబులూబోయె శాస్త్రములుబోయె
కార్యశూరతమచ్చుకైనలేదాయె
కాళిదాసులనెవరు కలనైన దలపరు
షెల్లిషేక్స్పియరుల జపముజేసెదరు
పాగ, అంగరఖాలు భారమై చిటిమి
హేటుబూటులజూచి యానందపడుచు

మనమతములమాట మఱచిపోయెదరు
పరమతములకొఱకు బరిగెత్తుచుంద్రు
ఎవరియాచారంబు లెవరివేషముల
నెవరిభాషనువారు నాదరించుటయె
నఱయగాధర్మంబు నవనిలో కాదె?
బంగారములుపోయె భాగ్యములుపోయె
జర్మనీవెండితో నిండె దేశంబు
నాణ్యమైనపట్టు నగపడదు యెచట
నారఇమిటేషనులు నిండెదేశంబు
దేశీయసరకులకు దీనదశవచ్చె
విదేశీసరకులకు విభవంబుగలిగె
తెనుగుదినపత్రికల తెన్ను చూడండి
తెనుగుదేశమునందు దినపత్రికొకటి
క్రొత్తపత్రికమాట లెక్కయెందులకు
ఆదినుండియునుండె నాంధ్రపత్రికయె
బుబ్బలోపుట్టుచును మఖలోనుమాడు
తెనుగుపత్రికలనీ తెలుగునఱయండి.
బంగాళిక్రాఫింగు బంగాళలాల్చి
కలకత్తా స్లిప్పర్లు కండ్లగంతలును
ఈగవాలినపగిది మీసంబుతీరు
ఫ్రెంచిమీసంబులు సమ్మర్ క్రాపులు
ఫేసుపౌడరు క్రీము వేసులైనులును
షోక్కై సిగరెట్టుపీక చేతులను
పార్టుకోటులు పెద్ద లంగాళరాయిలను
బూటుహ్యాటులుమరియు బుట్టటోపీల
వేషమిటులుండగా భాషవినరండి
సగము యింగ్లీషగును సగము తెనుగగును
పూర్తిగా నెందునూ మాట్లాడలేరు
తెనుగువిలాసముల్ తెలియదనిదఱచు
యింగ్లీషులోవ్రాయ నిచ్చగింతురుగ
తెనుగుదేశమందైన తెనుగులోవ్రాయ
తెనుగువారలధర్మ మనిదలచరండి.
వేషభాషలకొఱకు వేడుకులకొఱకు
బ్యాటరీలకు మంచి బ్రాందీలకొఱకు
టూతుపేష్టులకొఱకు జీతంబులగును
ఆదాయమొకటైతె వ్యయము రెండగును
ఆదాయములకంటె వ్యయముమెండైన
ఆలిబిడ్డలకెట్లు యన్నంబుగలుగు?
అనుకరించెడుబుద్ధి అలవాటుయయ్యె
బాగుగాయోచించి బనిచేయువలయు
ఎఱిగిమెలంగుమ తెనుగు బిడ్డపుడు
జయము నీకగును నిక్కంబువినుము.




# సంయుక్తరాణి లేఖ

పూజ్యపాదుకా జయచంద్రభూవరులకు
భక్తితోఁ బ్రియపుత్రి సంయుక్తరాణి
యర్పణముసేయుచున్న బాష్పాంజలి యిది.
జనక !
యీలేఁకఁగనుము, మచ్చరమువిడుము.

వయసును, సచ్చరిత్రమును, బాటవమున్ విలసిల్లుక్షత్రియాన్వయమణిఁ, బృథ్వీరాజనృపవర్యుని, మత్కులధర్మమెంచి నా ప్రియునిగ నెందుకూర్మిని వరించితి, నీవెదలోనవాని న ప్రియునిగ నిర్ణయించుటయెఱింగియు; ధర్మగుణానురక్తనై.

నీతలఁపు, నీపలుకు, నీ
సేఁతయుఁ గులధర్మమునకు సేఁగి; జనక హా
స్నేతనువీడుట, సాధ్వీ
నీతికి లేఁతయని తెగువ నెఱపితిఁ జుమ్మీ!

ఆగ్రహింతువో లేక యనుగ్రహింతు
వో, యెట్లైన మంచిదేనుమ్మ; ప్రేమసుండు
పృథ్వీరాజేంద్రుఁడే నాకుఁ బృథ్వియందు
నీ శుభోదంతమున కుబ్బ వీసుదక్కి.

నవలాడెందంబది నవ
నవనీతం; బార్తిశిఖకణము సోఁకఁగనే
ద్రవమై, ప్రవాహమై, మా
నవచైతన్యమ్ము నెల్లనవయఁగఁజేయున్.

ప్రేమమయసుధామూర్తి సాధ్వీమతల్లి,
కలుషరాహిత్య జీవనోత్కలిక, గరిత,
మానినీమణిగేహ సామ్రాజ్యలక్ష్మి,
తరమె తెలియఁ దన్మహిమ సాధారణులకు?

# గృహలక్ష్మి

ఇంతులహృద్గభీరత గ్రహింపఁగ శక్యమె యేరికిన్? నిజ
స్వాంతము దోల్తనే పురుషచంద్రుని కుంకువ వెట్టి వారు ప్రే
మింతురు వానికై సుఖసమృద్ధియు, జీవన సౌరభమ్ము న
ర్పింతురు; తన్నిరోధకులఁ బెంపుగణింపరు స్వాభిమానలై.

విస్మయమయ్యె నీహృదయ విభ్రమణంబుఁ గనంగ; స్వీయధ
ర్మస్మృతి నీకుదప్పెనదో? రాజకులాభరణుండవయ్యు, నీ
వస్మదుదంచితాశయ మహో! యరికట్టఁగడంగినావు; చి
త్తస్మరణీయుఁ డొక్కఁ డెకదా స్మరుఁ డుత్తమవంశజాతకున్.

చక్కనివాఁడు, నన్ వలచి చయ్యన దన్ వలపించుకొన్నవాఁ
డక్కటికంబువాఁ డతని నల్లునిగా వరియించి తెచ్చి నా
మక్కువఁ దీర్ప కీపగిది మానసమందున మచ్చరించి తీ
వక్కట! దండ్రివా? జనకు నాకృతిఁ దాల్చిన రక్కసుండవే.

జన్మంబో? చవుహానువంశమునఁ; బ్రోచ్చండ ప్రతాపప్రభా
వోన్మేషంబో? నిసర్గ సత్త్వము; హిందూర్వీప్రపూర్ణైకసం
విన్మానోన్నతి? సాటిలేనియది; ప్రథ్వీరాజరాజేంద్రుఁడే
తన్మాత్రుండె? సమస్తమౌళిమణిదీప్తశ్రీపదాబ్జుండిలన్.

నీ కుటిలప్రచారమున నేనును నాప్రియుఁడున్ నశించినన్
శోకము జెంద నెవ్వఁడు; విశుద్ధసతీపతి ధర్మమూర్తి సు
శ్లోకము జెందుఁగాక! మముజోడెడఁ బాపెడు నీదురంతమున్
జేకొని గ్రంథకారుఁడు రచించునో యేమొ సువర్ణపంక్తులన్.

పృథ్వీరాజమౌళి గృహలక్ష్మి నయనముల్
ఖేదవహ్నిఁ జెమ్మగిల్లెనేని
కుమిలి కూలిపోదె కులమెల్ల జయచంద్ర
పట్టెనింక నుసురు పెట్టకయ్య.

గోనెల నరసింగరావుగారు, ఎం.ఏ.;బి.యల్.

# వుద్యోగం గురించి

'అనసూయ'

(మగని చెవిలో)

కాళ్లపీకు! ఒంట్లోఎప్పుడూ ఉష్ణపుపిసరు వచ్చినట్లుండడం! తిండి నాలుగు మెతుకులైనా నోటికిపోక పోవడం! తిన్నది యిమడకపోవడం! ఇలాగు నానా చికాకుగా ఉన్నదండీ! నాకేదైనా తెనుగుమందు యిప్పిస్తేనేగాని కార్యంఉన్నట్లు కనపడలేదు!

'నీకు మరెప్పుడు మహాఆరోగ్యంగా ఉండి గునగునలాడుతూ గున్న ఏనుగలాగు తిరిగేవు? రోగంలేని పెళ్ళాం ఎలాఉంటుందో అని కేదవాపు పట్టిపోయింది!'

అయినా నా గురించి మందులకూ మాకులకూ మీరుఖర్చుపెడుతూఉన్నసొమ్ము ఇంతాఅంతా కాదు!

'అల్లా ప్లీడరుపెళ్లాన్ని చూస్తే ముచ్చటవేస్తుంది! బంతిలాగుంటుంది! రోగమన్నమాటే లేదు!'

మీకు రోగంలేని పెళ్లామూ నాకు జీతంఉన్న మొగుడూదొరికిఉంటే బాగానేఉండును! కాని మన ఉభయులమూ ఇట్టిదానికి నోచుకోలేదు! మీకే యే మునసబుపనో యే మేస్ట్రీటుపనో కాకూడదూ?

'మునసబుకేమి మూడుకళ్లున్నాయా యేమిటి? వాడికి మాకన్న ఉన్నహోయి యేమిటి? ఏ ఆరుగంటలో నడుము విరిగిపోయేటట్లు కూర్చుని చేయి పీకిపోయేటట్లు వ్రాసుకొని చెవులు చిల్లులుపడేటట్లు వింటేనే గాని వాడికి జీతం ముట్టదు! మా స్వేచ్ఛవాడికెక్కడ వస్తుంది!'

ఔను! అంబారివేసిన పట్టాభిషేకపు ఏనుగకీ గంతలో నిశ్చింతగా తిరిగే గ్రామసూకరాలకీ స్వేచ్ఛలో తేడాలేదూ? ఉన్నది! ఉంటేమాత్రము దాని గౌరవమేమిటి! వీటికిగౌరవమేమిటి? పూటకూళ్లమ్మ పుణ్యమూ ప్లీడర్ల గౌరవమూ రెండూ ఒక పుస్తకంలోనే వ్రాయబడిఉన్నాయి.

ముందో బంట్రోతు, వెనకో బంట్రోతు, నడుస్తూ ఉంటే, ఏవిచారమూ లేకుండా ఏనుగులాగు నడిచి కచేరీకి వెళతాడతను. అతడు ఇంటిదగ్గిర బయలుదేరిన దగ్గరనుండీ కోర్టులో కలకలమే! మీరో! మీరు బయలుదేరిన దగ్గరనుంచీ మీకడుపులో గలగలే! పార్టీలు రాలేదనో సాక్షులురాలేదనో వచ్చినసాక్షులు తయారుకాలేదనో, తయారైనసాక్షులు సరిగా చెప్పరనో, సరిగా చెప్పడానికి వప్పుకొన్న సాక్షులను అవతలవాళ్లు దిగలాగేసేరనో, మునసబు ఎవడిమీద పడి ఏకేసు పిసికేస్తాడనో, ఇలాగు అనేకరకాలుగా అపరిమితమైన ఆందోళనపడుతూ, పార్టీవాడు ఫీజు యివ్వక తిప్పలుపెడుతున్నాడని ఒకమూల చీదర పడుతూ, అనునిత్యమూ గుండె చిటుకుచిటుకులాడుతుండే బ్రతుకుమీది. చలికాలంలో వెచ్చనికాఫీ త్రాగితే ఉండేహాయి అతనిది. నడివేసవిలో నాలిక లాక్కుపోతూ గుడ్లు పేలిపోతూఉంటే చాలీచాలని ఆముదపుడోసు పుచ్చుకున్నహోయి మీది!

మునసబుకు మూడుకళ్లెందుకు? ఉన్న రెండు కళ్లూ చాలవూ మీలాంటివాళ్లని మీరిపోవడానికి. అయితే మూడోకన్ను ఉండదనికాదు నేననేది! అది అపాయింటుమెంటు ఆర్డరుకి అంటుకొనే ఉంటుంది. అట్టివారిని యిచ్చకాలాడి పొంగవేసి వారిదయ సంపాదించాలని ఎన్నిరకాలుగా మీవాళ్లు పాటుపడతారో చూడండి! అప్పడాలు పెట్టించడం

దగ్గరనుండి ఆగమాధ్యాసందాకా అన్నీ అవలంబిస్తారు! మునసబును వేదాంతం యిష్టమైతే అంటారూ వేదాంతులే! మరి తంపిలో సౌఖ్య బుద్ధి ఉండదు. అతనికి హరికథలు కావలస్తే ప్లీడర్లందరూ హరిదాసులే! అవి తాళపుచిప్పలు వాయించడంకాదు! ఆతడు పేకాటఆడితే అదివరకు ఇస్పేటాసుఎరగని వాడు కూడా ముందుగా ఉరుకుతాడు మూడు ముక్కాల ఆటలోకి! అంతయిచ్చకపు బ్రతుకు మీ ప్లీడర్లది. చీడీమీదనుండి మునసబు ఏమిరా అనేసరికి నలుగురు బంట్రోతులు నాలుగుమూలలనుండీ పరుగెత్తి వస్తారు. వాడి యింటివద్ద చెట్లక్రింద తచ్చాడే వాళ్లు పంచపాళీలో పొంచుండేవాళ్లు, గదిదగ్గిర ఒదిగిఉండే వాళ్లు, ఎందరో ఉంటూఉంటారు మీప్లీడరీ ఆశ్రితులు. కాని గోచీకట్టుకున్న కంపునాయుడైనా మీ మీద హవాలేకదా! నదురూబెదురూ లేకుండా మేడలెక్కిపోతారు,మిద్దెలెక్కిపోతారు! ఎక్కడుంటే అక్కడే పలహాలు మొదలెడతారు! గోచీకొంగున కొంచెమైనా ఉండకపోతుందా అని మీవాళ్లఆశ. అంచేత మీరు పొమ్మనలేరు! మరీ ఆరితేరిన ఊపర విల్లిపార్టీఅయితే అఫార్టీ కూడా చేస్తారు. అట్లుచేసినా కాణీఫీజు యివ్వకపోయినా యింటికివచ్చిన అపుపడ్డ పేదకడి వెయ్యకపోతుందా అని బుట్టపట్టుకొని పుట్టెడాశతో కండ్లెక్కపెట్టుకొని కాచుకుంటారు మీ ప్లీడర్లు!

నిజంగా మేష్టరంటే మీరు వేళాకోళంచేస్తూ ఉంటారుగాని వాడికీఉన్న ధైర్యసాహసాలు మీ వాళ్లకి ఉన్నాయూ! మన అబ్బాయిని ప్యాసుచెయ్యక పోతే మీరువెళ్లి చెప్పేరు! స్నేహితులచేత చెప్పించేరు! ఏమైనా ఆహెడ్మేష్టరు విన్నాడూ? లక్ష్యపెట్టకుండా రాజుకొడుకునే ఉంచేసేడుట! పనిపోతేపోనీ గాని పట్టువదలేదు కాడట! స్వతంత్రమంటే అది. సాహసమంటేఅది. ఘనులకు ఎందుకు గౌరవంవస్తుంది? తలను కొన్నది ధర్మమనితోస్తే · ప్రాణంపోయినా పట్టు వదలక పోవడంవల్లనేగదా! ఆ మేష్టరులాంటి ధైర్యసాహసాలు మీవాళ్లకేవీ? ప్లీడరు బోర్డుప్రెసిడెంటైతే కంట్రాక్టులన్నీ పట్నాయిళ్లకే! తన పార్టీతరఫున సాక్షిగావచ్చిన మేష్టరు పెలపుదరఖాస్తు పెట్టవలసిన బాధేలేదు. ప్రెసిడెంటు గరిటతో ప్రాక్టీసుచేవడం ప్రారంభిస్తాడు! అంచేత లాపాశికీ నాకొకమాట చెప్పండి! ఆకళ్లజోడుకమ్మ ప్రెసిడెంటుకు ఏపాటి ధర్మసాహసాలున్నాయి! బోకులను చుట్టూచేరదీసి పథతిర్చి ఆత్మస్తుతి పరనిందాతప్ప పూనుకొని పుంజెడు మందికి ఉపకారంచేయగలిగేడా? ఎంతసేపూ దొడ్డ కబుర్లూ నీతివాక్యాలూ తీపిమాటలూ చెప్పినంత మాత్రంచేత పాపం వీడు పరమోపకారిఅని అనుకుంటారా? మా మేనమామకి ఉద్యోగంకోసం వాడి దగ్గరకి తిరగేసరికి కాళ్లరిగిపోయినాయట! కబుర్లు తప్ప కథలేదు. పైకిచెప్పేది వేరు, లోపలచేసేది వేరు ఇల్వలుడి అన్నదానం రావణుడి వేదపాఠంలాగు. వాళ్లకు అందువల్ల ఎట్టికీర్తివచ్చిందో వీడికీ అంతే! కారణం యేమిటి? ప్లీడరితో ప్రెసిడెంటు హోదా మిళాయించే! చల్లలో పాలుపోసేసినట్లు పాడై పోతుంది. ఈవృత్తికి అధికారంతోడైతే అంతాకలుసు కలుసు పెరుగూకాదు–పాలూకాదు – విరుగువిరుగు! మరెవరైనా అయితే ఆరెమిలక్షను నాలుగురోజులూ నానారకాలవాళ్లకీ నమస్కారాలుపెట్టి వసుదేవుడే చేసేడు మనకేమిటని గాడిదకాళ్లుఅయినా పట్టుకొని బ్రతిమాలుకొంటూ అరచేతిలో స్వర్గంచూపిస్తూ నీ తమ్ముడికి సబురిజిస్ట్రారుపని వేయిస్తాను. నీకొడుక్కి హెల్తాఫీసరుపని యిప్పిస్తాను. మీబావకు పంచాయితీ ఆఫీసరుపని యిప్పిస్తాను. అని ఏమో గగనకుసుమపు ఖరార్లుచేసి ఆకాస్త అవసరం తీరిపోగానే తలవంక పెట్టి తలుపవతల ఉండమంటాడు! ఈనిచ్చెనగాళ్లు మననికూడా మేడమీదికి లాక్కుపోతారని ఊత యివ్వడం! నిచ్చెనమీదినుండి మేడెక్కిపోగానే నిచ్చెనతోపాటు ఊతగాళ్లనుకూడా వాళ్లు తన్నడం! మీరెవ్వరప్లీడరుకి అయిందికదూ అలాంటిపరాభవం? కాని మీ ప్లీడరు ప్రెసిడెంటైతే అలాగు చెయ్యలేదు

కదా! చచ్చేదాకా ఒదుగ్గుబతుకే! 'క్షీరాబ్ధి లంకలో చేరినప్పటికైన, కొంగతిండికి నత్తగుల్లలేను!' అన్నట్లు హోదానుతోడు సొమ్ములు కాసులుండాలి! హోదాను సాయంచేసిన సాయిల్లో సాపాటుకూడా సాయంచెయ్యాలి! అంచేత హోదాలున్న ప్లీడర్లే యిలాగు వెలుగుతూఉంటే మీలాంటివాళ్లబ్రతుకు చెప్పేదేమిటి? మునసబులతో నూ మేజిస్ట్రేట్లతో నూ తులతూగుతారా మీరు!

'మెట్రిక్కు మేజిస్ట్రేట్లతో నైనా తులతూగలేక పోతామా?'

మెట్రిక్కు అయితేనేమి? స్కూలుఫైనలుఅయితే నేమి? అదికూడాలేని మేజిస్ట్రేటైతేనేమి? అరుగంటలుబస్సు ఆపించివేస్తాడు! మీవాళ్లు అరునిమిషాలు అయినా ఆపించగలరా? బస్సు వాకిట్లోకివచ్చి నిలబడ్డతరువాత ఆ మేజిస్ట్రేటుగారి ఆడంగులు తలలు దువ్వడంకోసం పన్ను వెదకడం ప్రారంభిస్తారు! సాని సర్దుకొసేసరికి మద్దెలవాడునీలిగి చచ్చేడన్నట్లు వాళ్ల ముస్తాబులు పూర్తిఅయేసరికి బస్సువాడికి ప్రాణాలు పోతాయి! ఎన్నిబింకపుమాటలైనా ఇరుగుపొరుగువ కూర్చున్నవాళ్లతో అంటాడుగాని కాలుకదపలేడు కదా! బస్సు నడిపించలేడుకదా ప్రభుబంధువులు రానివే! మీరో! దేహబాధకు వెళ్లబోతున్నా మానేసిపరుగెత్తివెళ్లి ఎగశ్వాసతో బస్సుఎక్కవలసిందేగాని గడ్డాంపట్టుకొని కండక్టరుగాడిదగ్గరనుంచీ బ్రతిమాలుకున్నా నిమిషంసేపైనా నిలబెడతాడా!

మళ్లీ అలాగని మేజిస్ట్రేట్లకు వెంగమాటంటుందా? ఎప్పుడూ బస్సువాడిమీద ఏదోఒక కేసు! కేసులో తప్పుకుంటాడాజరిమానా! దానిదారిదానిది, దీనిదారి దీనిది! తీర్థానికితీర్థమే, ప్రసాదానికిప్రసాదమే! ఏమైనాఅంటే, ఇంకాశిక్షవెయ్యలేదు, సంతోషించు, పో, అంటాడు. అదీవాడిసాయం! నాగమయ్యతండ్రీ, నాకేంసాయంచేస్తావు అంటే, నా కంటనీవుపడకు, నీకంటనేనుపడను, అన్నట్లే! మేజిస్ట్రేట్లను బస్సులలో తిప్పుతున్నామని గర్వించడం ఎనుబోతుతో నక్కేట యీదినట్లేగదూ!

మేజిస్ట్రేటు నాకా ఎందుకు? అమల్ల గుమాస్తాదగ్గర అంత ఒదుగెందుకండీ మీకు? మొన్నను వాడడిగితే పార్టీలసొమ్మని నాతో చెప్పినదానిలోనుంచి పాతిక రూపాయిలు వాడికిబదులుయిచ్చేనేరుగదా? స్నేహమా బంధుత్వమా? ఏమిటికారణం? పట్టిబెదురు తప్ప! అవునుగాని వాడికి డాగాదొరుకుతుందా ఏమిటండీ! ఎప్పుడూవాడు ఏకాలానికితగ్గపళ్లు ఆకాలంలోబుట్టలకొద్దీ కొనిపోసిస్తూఉంటాడు! వాడి పెళ్లాంకట్టుకొనేచీరలుచూస్తే మీ ప్లీడర్లపెళ్లాలు ముఖం ముడుచుకోవాలన్నమాట! ఇకను, వాడి యింటికి యెవళ్లుఅయినాపంపిస్తారో లేక వాడే కొంటాడోగాని ఎప్పుడూ ఏవోదినుసులువస్తూనే ఉంటాయి! ఇటువంటివన్నీ అతడుకొంటే నెలకు ఏనూటయాభై ఏ రెండువందలో కాకమానవు! అంత స్వల్పజీతగాడుగదా ఇవన్నీ యెలాగుచేస్తున్నాడంటే! పైరాబడివల్లనే నా? ఆహో! అమల్లగుమస్తాపాటి అధికారమూ ఆదాయమూఅయినా లేని యీవృత్తిలోనికి ఎందుకు గెంతేసేరండీ? మొదటిలో మీకు యెవరూ యీవృత్తియొక్కలాభనష్టాలు కష్టసుఖాలు వీటినిగురించి చెప్పలేదాయేమిటి? చెప్పకేం? చెప్పే ఉంటారు! చెపితే, ఏదోవాళ్లు దోచేసుకుంటూ మనకు లేకుండాచెయ్యడానికి యిలాగుయెత్తు యెత్తుతున్నారని మీరుఅపోహపడిఉంటారు! నేనుచెప్పితే స్త్రీబుద్ధిఅన్నారు. తోసిపారేసేరు! ఇప్పుడు చెయ్యి కాలినతర్వాత ఆకుపట్టుపట్టుకుందికిమాస్తే కార్యమేమిటి? మీరు నిరుడుచెప్పేరుకారూ మీ స్నేహితుడు చెమిటిప్లీడరుతో! అయితే విన్నాడాయేమిటి? బోర్డుకట్టేసేడు! సాలెపట్లలేసేడు! కాచికూర్చున్నాడు! ఈగలుదొరికితేకదూ! వేళ్లుతెన్నుకొని ఉన్నచెట్లకు దళంగాఅల్లిన సాలెపట్లనుపడిపించుకొని అయీగలు ఎలాగువస్తాయి? పెద్దవాళ్లు పీల్చిపారేసిన పిప్పిపార్టీలుదొరికితే కార్యమేమిటి? కడుపునిండనా,

కాలునిండదా? రక్తమాంసాలు చప్పరించి ఎముకలు మాత్రం మిగిల్చి పెద్దవాళ్లుతరిమివేసిన జీవచ్ఛవం పార్టీను ఎంతమందినిపట్టుకొని పీక్కుతింటే పొట్టగడుస్తుంది? ఏయేమగకుంభస్థలమో రోజూకొడదామని వచ్చేరు! ఇలాగు అస్థిపంజరాలమ్యూజియము అయిపోయింది వాడిఆఫీసు! అతనిరాబడి యీవృత్తియొక్క ఖర్చువెచ్చాలకూ వేషభాషలకూ ఏమిటాగుతుందండీ–సముద్రుడికి ఉప్పుదర్శనంలాగు!

కాని, అంతకంతకీ మీస్ప్లీడర్లు మరీబాగా తేలుతున్నారు! ముప్పయ్యేళ్ల వాడికిబంతాట! నలభైయేళ్ల వాడికి గోట్టికాయలాట! ఏభైయేళ్లవాడికి దశావతారి! అరవైయేళ్లవాడికి ఆడవాళ్లకబుర్లు! మీరందరూ ఇలాగు కాలక్షేపము చేసేస్తున్నారుగదా, ఖర్చువెచ్చాలకి ఎక్కడ కన్నంపెడుతున్నారు? భూములాలేవు, ఫ్యాక్టరీలాలేవు; అప్పుసప్పుపుట్టదు; మరోవిధమైన ఆస్కారంలేదు; అవ్వతీవినగంధంలాగు ఎక్కడికక్కడే ఇగిరిపోతూఉంటే దినచర్య ఎలాగుచేస్తారేమిటి? తాటిచెట్టునీడ తనకూపనికిరాదు, ఒకరికీపనికిరాదు,' అన్నట్లు మీస్ప్లీడర్లు ఒకరికొకరు సాయంచేసుకుందుకైనా సావకాశంలేదుగదా! మరో పనిచెయ్యడానికి ముదిరిపోయేరు! తాతలనాటి ప్రాతకథలో చెప్పిన టంటాలసులాగున్నది మీవాళ్ల స్థితిగతులు! మీకుయిట్టే రాబడివైభవము వెలిగిపోతూవుంటే మీఅదృష్టంకొద్దీ నాలాంటిపెళ్లాం! ఏదో దుక్కలాంటిపెళ్లాంఉండి నిరోగంగాఉంటే అదో కొంతనెమ్మదికి విశ్రాంతిగాఉండేది! కాని దురదృష్టంలో అధికమాసంలాగు మీరోగానికితోడు నారోగాలు! పిల్లలరోగాలు! మాజబ్బు ఉపద్రవం మీదబ్బుదరిద్రం, రెండూఒక్కలాగేఉన్నాయి!

పోనీ, డాక్టరు పనికేనా చదివేసేరా? ఇంట్లో జబ్బులకేనా కానీఖర్చు అక్కరలేకుండా మందులు దొరుకుతూఉండునుగదా! ఏమిటండీ! ఈఊరిలో ఇటువంటిడాక్టర్లు లావైపోయినారు? ఏజబ్బువచ్చినా కైపోయిందనేఅంటారు! ఒకడికి కళ్లచూపులేదు, రెండోవాడికి నోటమాటలేదు, మూడోవాడికిబొక్కపులిలాగుఆశ! మరొకడి మొగం ఎప్పుడూ ఎవళ్లనో వెక్కిరిస్తున్నట్లేఉంటుంది! అర్థానికి మీస్ప్లీడర్లుప్రాణానికి యీడాక్టర్లు మాబాగాజతపడ్డారు! ఎంతచచ్చుకేసైనాపట్టేస్తారు మీస్ప్లీడర్లు! క్రిందపడ్డా మీదనున్నవాడినేఅని ప్రగల్భాలుపలుకుతూఉంటారు! ఒరుగులుకాచేస్తామనీ జోవులుతిప్పేస్తామనీ పొంగకేస్తా డబ్బులాగుతూఉంటారు మీస్ప్లీడర్లు! ఆధశ్శయనమై పోతూవున్న ఇంకా పోఫువున్నదంటూ మందులు పోసేస్తూఉంటారు డాక్టర్లు! కాని ఆమందులన్నీ గురికిబారెడుదూరమే మీ ఆర్గ్యుమెంట్లలాగు! అయితే మీమీద అపీలుఉన్నాది! వాళ్లమీదయముడి కోర్టులోకిగాని యీలోగా అపీలులేదు! బ్రతికితే భార్యమంగళసూత్రమహిమగాని నాడబ్బుతెగలడం నీయబ్బ బ్రతకడం అన్నరకంలోనివాళ్లు యీవూరుడాక్టర్లు!

పోనీ! ధర్మాసుపత్రికి పోదాం, ఏ నీళ్లయితేనేమి, అని అక్కడికివెళితే, అమాడుమొగండాక్టరు పేరుమాత్రమేఅడిగి చీటీరాసిపారేస్తాడు! జబ్బుగురించి అడగడంలేదు, పోల్చడంలేదు! ఇంకా కొంచెం గొప్పవాళ్లలాగు కనిపిస్తే 'నాలికసాచు' అనిమాత్రం ఎదో పెద్ద తనిఖీచేసేవాడిలాగు అడుగుతాడు! అంతే! రోగానికీ మందుకూ సంబంధమేలేదు! సంబంధమంతా చీటికీ మందుకూమాత్రం ఉంటేఉండవచ్చును, కంపవుండదు ఆవేళకి కైపెక్కి ఉండకపోతే! ఇంకాసంబంధంఉంటే ఆడాక్టరుకీ అతనిజీతానికీమాత్రం ఉంటుంది! నెలాతిరిగివచ్చేసరికి పుట్టమీదపెట్టినట్లు కొత్తనోట్లదొంతి ఏమూడు నాలుగువందలో ముట్టిపోతూఉంటాయి! రోజూ వచ్చేరోగులు ఎలాపోతే వాడికేంకావాలి! రోగి పోతే రోగముంటుందా అన్నరకం వాడిది!

ఔనుగాని ఆడాక్టరు మీమేస్ట్రేటు ఎందుకండీ ఆలాజట్టుగా తిరుగుతారు?

'వాడిసర్టిఫికెట్లు వాడిదగ్గిర పనిచెయ్యాలి, వాడికి కొన్ని మందులు వాడిదగ్గరకావాలి!

దుమ్ములోంచితీసిన దుంపలాగు మొగం పీషూపిడికి వెఱ్ఱివేషాలున్నాయా? గుఱ్ఱం గుడ్డిదైనా దాణాకు లోటులేదన్నమాట! ఏమైతేనేమిటి ఎన్నిదుర్గుణాలుంటేనేమిటి?! మేస్త్రీటు మేస్త్రీటే. వాడింటికి అలాగు రోజూ పోలీసువాళ్లు దొంగలను తీసుకొనివస్తునే ఉంటారు? సలాములు పెడుతు వేచుంటారు. ఇంటిదగ్గరే కేసులు విచారణచేసి వేస్తూ ఉంటాడు మీలాంటి వాళ్లు అందరూ అక్కడకూడా అణిగిమణిగే ఉంటారు! వాయిదాలకోసం బ్రతిమాలుతూనే ఉంటారు! కాలి నడకనువెళ్లినా మేస్త్రీటే; కారుమీద వెళ్లినా మేస్త్రీటే; బంగాళాలో కూర్చున్నా మేస్త్రీటే; పంచపాళీలో కూర్చున్నా మేస్త్రీటే. బదిలీ అయిపోతే వాడికి టీపార్టీలిస్తారు. డిన్నరుపార్టీలిస్తారు. వాడిపెళ్లాన్ని పిల్లల్నికూడాపిలిచి విందులూ గోవిందులూ చేస్తారు.

మీకో బదిలీఅనిగాని టీపార్టీఅనిగాని డిన్నరు పార్టీఅనిగాని మీ ప్లీడర్ల గురించి ఎప్పుడైనా ఉంటుందీ. ఏకంగా లోకంనుంచి లోకానికేగాని ఊరునుండి ఊరుకు బదిలీలు లేవుగదా! ఎప్పుడూ యాచించిన ముఖాలే చూచుకుంటూ చెప్పినకబుర్లే చెప్పుకుంటూ ఆడినపిక్కలేఆడుకుంటూ కొట్టినదచ్చాలే కొట్టుకుంటూ 'ఇదేప్రకారం గా' కూపస్థమండూకాలలాగు చర్వితచర్వణపు కాలక్షేపంచేయడమేగాని చక్కగా మరోచోటికి బదిలీలూ అచ్చట కొత్తయిళ్లుచూచుకోవడమూ, కొత్తకాపురాలు పెట్టడమూ, కొత్త ముఖాలుచూడడమూ, కొత్తవిశేషాలుజరగడమూ, నిత్యమూ బంట్రోతులు ఉండడమూ—వీటికి నోచుకోలేదుగదా!

అందుచేతనేకాబోలు 'ఉద్యోగం పురుషలక్షణం' అని పెద్దలన్నారు!

'మాదిమాత్రం ఉద్యోగంకాదనుకున్నావా?'

కాకేమి? కాఫీహోటేలుఅయ్యరుదీ ఉద్యోగమే, మీదీఉద్యోగమే! అయితే అయ్యరుమాత్రం వేల కొద్దిసంపాదిస్తాడు! మీరుపస్ములు కాజాలతోనే శరీరాలువాలిస్తారు! ఎందరుమేస్త్రీట్లను ఆశ్రయించేది, ఎందరుమున్సబులను ఇచ్చకాలాడేది, మీరాత మీ రాతేగదా! "కమలాసనునికెంత కరుణగానడిచిన కలహంసలకు తూడుకాదలేను!" ఉద్యోగమంటే మీదాఉద్యోగం! రాజుగారిపెళ్లాం మేడెక్కితే కుమ్మరాడిపెళ్లాం గుడిసెక్కిందట! అలాగేఉన్నది మీఉద్యోగం! ఏగవర్నమెంటువారో ఏమహారాజులుంగారో దళసరిముద్ర కాగితంమీద ఫర్మానా యిచ్చి ఉద్యోగంయేర్పాటుచేసి ఆఉద్యోగానికి తగినజీతం హోదా బిళ్లబంట్రోతులూ అన్నీసమకూరిస్తే అదిఉద్యోగంగాని, ప్లీడరీబోర్డుకట్టిన ప్రతీవాడిదీ ఉద్యోగమేనా? 'ప్రాపులుకత్తిరించబడును' 'మేకులువేయబడును' అని బోర్డులుకట్టినవారికి ఏపాటి ఉద్యోగలక్షణములున్నాయో మీవీ అట్టివే! పోనీయండి! ఒక్కమారు మీరైలుప్రయాణాలసంగతి తెలుసుకోండి! టిక్కట్టుకొనడానికైనా ఎవడూ ఉండడుగదా! టిక్కట్టుకిటికీదగ్గరకువెళ్లి చమట కంపునాయుళ్లమధ్యనుదలిగిపోతూ టిక్కట్టుస్వయంగా కొనుక్కోవలసినదేగాని పార్టీవాడైనా ఆవేళకు అడ్డురాడుగదా! వెయిటింగురూములు దివాలా బంట్రోతులున్నవాళ్లకేగాని మీలాంటివాళ్లకు అర్హత లేదు! కాళ్లకిరత్తాలుదిగేటట్లు రైలువచ్చేదాకా పచారీచేయవలసిందేగాని వెయిటింగురూములోనికి వెళ్లడానికి అధికారంలేదుగదా! క్రిందకూర్చోడానికి వామోషీకా!

చూడండీ! అల్లాకోజాన మునసబు రైలుకు వచ్చేడు! అప్పుడాబంట్రోతుల హడావిడిచూచితీరాలి! అతడు దిగేకారువద్ద యిటొకడు అటొకడు! కారులోనుంచి ఒకడు, రైలుస్టేషను గేటుదగ్గరఒకడు; టిక్కట్టు కొనుటఒకడు, సామానులు తూపించడానికిద్దరు;

గొడుగుపట్టుకొని ఎండతగలకుండాఒకడు; మునపటు రైలుఎక్కినతర్వాత ఆ రైలుపుదగ్గరకమ్మేసి వీళ్ళందరున్నూ! వాళ్ళమధ్యనుండి గుమాస్తాలు బేటామీనులు, గాలికి చేలువంగినట్లు వంగివంగిదండాలు పెట్టిసెలవు పుచ్చుకుంటూఉండగా, మునపటు గారెక్కినబండీలో కూర్చుంటే వీళ్ళందరికీ మనమీద గురిగాఉంటుందని మీ వెర్రిమొగం ప్లీడరీకడు దాల్లోకి ఎక్కేడుగదూ! ఆతర్వాత స్టేషనుస్టేషనుకీ బంట్రోతువెళ్లి చూస్తూఉండడం, కావలసినవి తెస్తూఉండడం, ఇలాంటిప్రయాణం మీ మునపటిది! మీదో! మంచినీళ్లు కావాలంటే మరచెంబుపట్టుకొని స్టేషనుకొళాయికిపోవడమో, లేకపోతే రైలునీళ్లవాడిని యిచ్చుకాలాడి యెంగిలిగళాసులోనుండి పోయించుకోవడమో, అంతేగాని యితరదిక్కు లేదుగదా! అంతలోఉంది మీకహోదా, మీ ఉద్యోగమున్నూ! నేనుచెప్పినమాటవినండి! ఏదో కొంచెమో గొప్పో చెన్నపట్నంలో మేతపెట్టి ఏదో మోస్తరుది ఉద్యోగంసంపాదించండి! నాకు ఉన్న బంగారం త్రుణమో కణమో మీకుయిచ్చేస్తాను! మీరుచేస్తూఉన్న యీ'ఉద్యోగానికి' నాకు ఈసరుకులుకూడా ఎందుకు! మీరు ప్రయత్నంచేసినతర్వాత, అయిందా అయ్యలగాడిపెళ్లి, లేకపోతే గులాపువాడిపెళ్లి! కొన్నను ఎవడో అక్కడిపెద్దవాళ్లను ఎరిగినవాడు ఈపూరుకొమటినితీసికెళ్లి ఉద్యోగంయిప్పించేడట! అలాంటివాడిని ఎవడినోపట్టుకొని పాటుపడండి! దొరికిందా, కోటలోపాగావేసేరన్నమాటే! కాకపోయిందా, మీ'ఉద్యోగం'మీకు ఉండనేఉంది! ఇది ఎక్కడికీపారిపోదు, ఎవరూతప్పించేరు, ఎవడూ మిమ్మల్ని తీసేలేడు! ఈరామినాయుళ్లు ఈపట్నాయుళ్లు ఎక్కడికీ ఏవ్వమైపోరు! 'వాళ్లమెడకీ మీ పాదాలకీలంకే' అని వాళ్లంటూఉంటారుగదూ ఫీజు ఎగవేసేటప్పుడు! అలంకె ఎప్పుడూఉండేదే ఎటో ఒకవైపు! దానిగురించి ఏమీభయములేదు!

ఈవృత్తిమానేసి మరోఉద్యోగం అయితే చూడండి! నాకు ఏమందూ మాకూ అక్కర్లేకుండా రోగం దానంతట అదేకుదిరిపోతుంది! అప్పుడు నాకు మందులకోసం మీరు గవ్వఅయినా ఖర్చుపెట్టనక్కరలేదు! మనిషికిఉన్నదిపుష్టి, పశువుకితిన్నదిపుష్టి! అన్నట్లు ఆ రెనివి లోకేఉంటుంది ఆరోగ్యమంతా! వేడికివెయ్యిరోగాలు అంటారుగావి యీఆందోళనకు ఆరవైవేలరోగాలుపుడతాయి! ఆందోళనలేని హాయైనబ్రతుకు మనకు ఎప్పటికైనా ఈజన్మలో రానిఉందో లేదో?

---

# స్త్రీలు – వృత్తి

శ్రీమతి ఇ. కనకవల్లిగారు

వృత్తి లేక ఉద్యోగం అనగా ఒక కార్యం. అది మంచిదైన సదుద్యోగం అనిన్నీ చెడ్డదైన దురుద్యోగం అని పిలువబడుతుంది. యీ మంచిచెడ్డ ఉద్యోగాల్లో ఏదోవకటి ప్రతివారికి స్త్రీలకుగాని పురుషులకుగాని యుండితీరుతుంది. ఎందుచేతనంటే మనస్సు బుద్ధి యింద్రియాలు జాగ్రదావస్థలో క్షణంసేపుకూడా ఊరికేవుండవు. ఏదో ఒకపని చేస్తూనేయుండాలి. ప్రతి వ్యక్తిలోయుండే చైతన్యంలేక శక్తి ఏదో రూపంగా కార్యంగా పరిణమిస్తూనేయుంటుంది. వేదాంతంలోకూడా యీ చైతన్యశక్తే భగవత్స్వరూపమని, అంశ అని చెపుతూ యీ భగవదంశ ప్రకృతి సమ్మేళనమైన శరీరంలోచేరి సదా సృష్టికార్యం జరుపుతూయుంటుందని చెపుతారు. సృష్టి అంటే పిల్లలను కనడమే కాదు. నూతనత్వం కలిగించే ప్రతికార్యం సృష్టే. కొత్త పుట్టుక. ఇదివరకు మొద్దురూపంగాఉన్న ఒక వస్తు వికాసంకలుగజేసే నూతనపరిణామం. గనిలో మట్టితోకలసియుండే బంగారు అద్భుతమైన ఆభరణాలుగా తయారు కావడం. మొద్దుగాయుండే టేకుచెట్లన్నీ కుర్చీలుగా బల్లలుగా తయారుకావడం.

చైతన్యశక్తిచేత ప్రకృతిలో యీ పరిణామం లేక మార్పు ప్రతిక్షణం జరుగుతూనేయుంది. దీనికి స్త్రీపురుష స్వరూపంలోయుండే యిరువురి తోడ్పాటుయుంది. కాని యింతవరకు తమ శరీరంలోనుండి రక్తమాంసాలు పంచిపెట్టి నూతన శిశువులను ప్రపంచంలోకి తీసుకురావడం, వాళ్లను పెంచి పెద్దజేయడం, సంరక్షణకార్యాలే స్త్రీలకు ముఖ్యవృత్తిగా కనిపిస్తూంది. ప్రతి కార్యంవల్ల ఒక ఆనందమున్నట్టే యిందులోను చాలా ఆనందముంది. కాని నలుగురు పిల్లలను కనేటప్పటికి ఎక్కువ చక్కెర తింటే వెగటు పుట్టినట్లు వెగటు కలుగుతుంది. కాబట్టి దీన్ని సడలించి నూతనవికాసం కలుగడానికి ఏదో ఆనందం కలుగజేసే తీరికైన పనిఅంటూ ఒకటి ఉండాలి.

జీవితానికిగాను జరిగే పోరాటంలో చాలాభాగం పురుషులచేత జరుగుతుంది. అనగా యేమిటి? శరీరధారణార్థము చైతన్యం శరీరంలో యుండడానికి యింజనుకు బొగ్గులాగే ఆహారం అవసరం. ఈ ఆహార సంపాదనం అంతా పురుషులవల్లే జరుగుతూంది. సృష్టి మొదట్లోకూడా పురుషుడే వెళ్లి వేటాడి ఆహారం తీసుకునివస్తే ఆ స్త్రీ యిల్లు పిల్లలను కనిపెట్టుకొనియుండేది. యీవిధంగా Division of labour (శ్రమ భాగించుకోవడం) జరుగుతూండేది. ఈ నాడుకూడా అట్లాగే జరుగుతూంది. పురుషుడే ఆహారం సంపాదించే ద్రవ్యాన్ని సేకరించడానికి అగచాట్లుపడుతూన్నాడు. స్త్రీ మునపటిలాగే యిల్లు పిల్లలు కనిపెట్టుకుని

యుంటూయుంది. పిల్లలను కనడమే ముఖ్య కార్యం కాదు. ఆహారార్జనంలోకూడా కష్టపడాలి. ఒకరిమీద ఒకరు ఆధారపడి యుండకూడదా, ఎవరంతట వారు స్వేచ్ఛగా జీవించకలిగియుండి ఆనందానికోసరం పరస్పర స్నేహంగా యుండవచ్చును అన్న భావాలు యిప్పుడు ముఖ్యంగా పాశ్చాత్యఖండాల్లో వ్యాపిస్తూయున్నాయి. అమెరికా ఇంగ్లండు, ఫ్రాన్సు, రష్యా దేశాల్లో యిది యెక్కువగాయుంది. అమెరికాలో పోస్టాఫీసు మొదలగు ఆఫీసుల్లో చాలావరకు ఆడవాళ్లే. రష్యాలో ఆడవాళ్లు తీరా యుద్ధంకూడా చేయడానికి సిపాయీలుగా తయారవుతూన్నారు. స్త్రీ ధైర్యం చాలనివ్యక్తిఅని భీరువుఅని పురుషులు తెచ్చిపెట్టిన అపోహమే కాని వాస్తవంలో వాళ్లకే సాహసం, శౌర్యం, సూక్ష్మం యెక్కువ.

కాని యింతకాలం యీశక్తి ఏలా ఉపయోగపడుతోంది. బిడ్డలు కనడం పెంచడం యిల్లు చక్కపెట్టుకోవడం వంటచేయడంతో సరిపోతూంది. కొంతకాలం క్రిందటనే వినోదార్థం కుట్టుపని చెయ్యడం గ్రంథాలు చదువుకోవడం సంగీతం మొదలగు పనులు జరుగుతూ వస్తూ యున్నయి. ఆనందం సమకూర్చడానికి యివన్నీ చాలా మంచివే. కాని యెవరికి? వెనక బాగా ఆధారం ఉన్నవాళ్లకు. బాగా ఆస్తులుండి సంపాదించిపెట్టే భర్తలున్నవాళ్లకు. కాని నిరాధారంగా యుండేవాళ్లకు పురుషుల్లాగే స్వతంత్రంగా సంపాదించి జీవింపతలంచుకొన్నవాళ్లకు యివి ఉపకరించవు. సామాన్యం కూలిజనంలో చూస్తూన్నాం పురుషుడితో సమానంగా స్త్రీకూడా పైరునాటడం, కోయడం, కూలిచేయడం, శరీరశ్రమపడి పురుషుడితో సమానంగా కుటుంబపోషణం చేస్తుంది. కాని మధ్యరకపు సంసారులును, సంపన్నగృహిణులు పిల్లలను కని పురుషుడిమీద ఆధారపడియుండడమే తప్ప స్వతంత్రంగా జీవించడంలేదు. సంపన్నగృహిణులకు పుష్కలంగా డబ్బు ఉంటుంది కాబట్టి వాళ్లు ఖులాసాపనులు చేసుకోవచ్చు. కాని మధ్యరకపుస్త్రీలు యీ ఖులాసాల్లో దిగితే వీటికగు అపారమగు ఖర్చుకుగాను వాళ్ల భర్తలను పీడించినవారవుతారు కాని ఉపయోగపడేవారు కారు. కాబట్టి ముఖ్యంగా యింటివద్దేయుండి లాభదాయకంగాయుండే పనులు: నేర్చుకోవలసిన ఆవశ్యకం యెంతైనాఉంది. తక్కువ తరగతి స్త్రీలలాగా వీళ్లు ఆరుబయట శ్రమించలేరు. వీరి మనస్సు ఆ కఠినమైన పనులకు ఒప్పుకోదు. వీరు పెంపబడిన వాతావరణం వేరు. కాబట్టి చాలాభాగం మానసికంగా కృషిచేసే పనులుగాయుండాలి. అవి చాలా ఉన్నాయి.

# వి ధి

ఉ॥ చేతువు నన్ని కార్యముల జేయునియట్లు మెలంగు దెప్పుడున్
భూతలమం దొకింతయునుబొందవు నింద మహాబలాఢ్యులన్
భూతియుతుల్ సదావిభవభూషితకీర్తులనైన భిక్షులన్
గా తగజేతువీవు నినుగాంచగ నెంతటిశక్తివో గదా.

కం॥ హరిహరులంతటియా సుర
వరులైనను నిన్ను దాటి వర్తింపరు గా
కరయగ నెంతటివారలు
నరులన నెటు నిన్నుగడచి నటియింతురిలన్.

ఉ॥ శూరులు పాండుపుత్రులట శూలినిగెల్చిన జోదుఫల్గునుం
డారివు భీముభీముడును నస్త్రవిశారదులైన యాకవల్
వారిజనేత్రుడున్ బ్రియముబాయక బ్రోచుచునుండనక్కటా
భూరమణుండు ధర్మజుఁడుబోవడె కానకు నీకులోగుచున్.

కం॥ ఏరికినెయ్యది ప్రియమో
వారికి నద్దానియందె వాంఛలనిడుచున్
వారిదెస నింద మోపుచు
నేరనియటులుండు వీవు నెఱజాణవుగా.

సీ॥ పాండవుల్ విరటుని పంచనుండెడినాడు నినుదూఱిరే యంధు ననిరిగాని
శ్రీరాముఁ డడవికి సీతతో వెడలంగ నినునాడిరే కైక ననిరిగాని
నహుషుండు సర్పమైనవసిన యానాడు ఆడిరే వినుముని ననిరిగాని
కాంతతో జంభారిగానల జరియింప ననిరె ని న్నసురుల ననిరిగాని

గీ॥ నీదు కృతమంచు నెఱుగక నిఖిలజగము
వెట్టుచుండును నొరులపై వట్టినింద
నిన్నెఱింగినవారినే నిరుపమాన
శాస్త్రవేత్తలటంచును జాటనగును.

# గృహలక్ష్మి

సీ॥ మొగలసత్సామ్రాజ్యమునువీడి 'హుమయూను' వట్టియెడారులబట్టునాడు
రాణాప్రతాపుండు రాణివాసముతోడ నడవుల నిడుమలబడిననాడు
అళియరామారాయఁ డసమానశూరుండు పగతురచే ననిబడిననాడు
అబిసీనియాధ్యక్షు నవనీతలంబెల్ల బహుభీషణ శతఘ్నిబడిననాడు.

గీ॥ అరులశపియించి తురకలనాడిపోసి
నారు జనములు; నిను ననినారె యెపుడు
యేమిశక్తియొ నీయది యెరుగరాదు
తప్పునొనరించి నిందమాత్రంబు బడవు.

గీ॥ భాను డస్తమింపనియట్టి బహువిశాల
రాష్ట్రమును బాలనము సేయు రాజరాజు
అబలకొక్కతకై రాజ్యమంతవిడిచె
నందు రేగాని; విధిబలంబనిరె జనులు.

గీ॥ హరిహరులకైన గెలువంగ నలవిగాని
విధిబలంబని బలుకరే వెఱ్ఱిజనులు
అబల నొకప్రేమమూర్తియా నాడుదాని
బలమటంచును బలుకుట పాడియౌనె.

గంటి కృష్ణవేణమ్మ.




ఇటీవల బొంబాయినగరమున జరిగిన వినోదవేషధారణమందు
పాల్గొన్న బాలబాలికలు.



శ్రీమతి పంచాంగము తిప్పమ్మగారు.
పెనుగొండ బాలికాపాఠశాలయందు 25 సం. విదు
వక ఉపాధ్యాయవృత్తి నతి నిపుణముగ నెరవేర్చి
యిప్పు డుపకారవేతనము బొందుచున్నారు.



22-4-37 తేదీని తూర్పుగోదావరిజిల్లా కలెక్టరుగారి సతీమణి శ్రీమతి రాజవిభాయిగారి
అధ్యక్షతను జరిగిన శ్రీ కాకినాడ విద్యార్థినీసమాజ వార్షికోత్సవసమయమున
తీయబడిన ఛాయాపటము. ఇందు అధ్యక్షురాలు (మధ్యను) సభ్యురాండ్రు,
బాలికలును గలరు.

# నారీమణులు : గ్రంథాలయములు

దు. కృష్ణయ్యగారు

మహిళాభ్యుదయమునకు విద్యావ్యాప్తియే ముఖ్యమైనదిగాన స్త్రీల విద్యాభివృద్ధికై యనేకులనేక ప్రయత్నములొనర్చి దేశకళ్యాణమునకై పాటుపడుచున్నారు. వారు ధన్యజీవులు. వారికి ధన్యవాదములు. ప్రభుత్వమువా రాదినుండియు పట్టుదలతో పనిచేసియు మనదేశమున విద్యాగంధముకలవారిలో పురుషుల యందు 100కి 7.6 అనియు స్త్రీలలో 100కి 1.8 అనియు ప్రపంచములోఉన్న విద్యాశూన్యులలో మూడవవంతు మనదేశమున యున్నారనియు లెక్కలు దెలుపుచున్నవి.

విద్యావ్యాప్తికి మార్గములు 1. పాఠశాలలు. 2. గ్రంథాలయములు. విద్యా ప్రపంచములో స్త్రీలకై ప్రత్యేకింపబడిన పాఠశాలలు, సర్వకళాశాలలు చాల తక్కువయని యెల్లరకును విశదము. విద్యకుపునాది యనదగు ప్రాథమిక పాఠశాలలను జూచినచో బాలికలకు పట్టణములయందు ప్రత్యేకముగ పాఠశాలలక్కడక్కడ నేర్పాటు గావింపబడియున్నవిగాని గ్రామ జీవితముపై నాధారపడి పల్లెలల్లిబిల్లిగ నల్లుకొనియుండు మనదేశములో నారీమణుల విద్యావ్యాప్తికి మార్గములు నేటికిని తృప్తికరముగ లేవనియే చెప్పవలసియున్నది. సంయుక్త విద్య (Co-education) వలననైన బాలికలయందు విద్యావ్యాప్తికలుగ గలదేమోయని నిట్టి పద్ధతి యాచరణకు దేబడుచున్నది. మనదేశమున వీధిబడులయందీ పద్ధతియే మొట్టమొదటనుండి యున్నదనుట సర్వజనవిదితము. గ్రామములు నిదర్శనము లొసగుచున్నవి. కాని 'వంట చేయవలసిన ఆడుదానికి చదువేల'యను వెఱ్ఱివేదాంతము మనవారిని ఆశ్రయించియున్నందువనే మహిళాభ్యుదయమున కంతరాయము లనేకములు కనబడుచున్నవి. బాల్యవివాహములు—ఇంటిపనులు—తల్లిదండ్రుల బీదరికము—అజ్ఞానము—నిర్లక్ష్యము మున్నగునవి నారీమణుల దుస్థితికి కారణములు. ఎంతకాలము మననారీమణుల జ్ఞానాంధకారమున నుండురో ఎంత కాలము మనము మూర్ఖపద్ధతులతో మన స్త్రీలను బానిసలవలెజూచి వారి విద్యాభివృద్ధికి తోడ్పడమో అంతవఱకు మనదేశమునకు ముక్తి కలలోనివార్త.

నిరక్షరత్వ నిర్మూలనమునకును అక్షరాభివృద్ధికిని గ్రంథాలయములే ముఖ్యసాధకములుగాన నేడు గ్రంథాలయోద్యమము శాఖోపశాఖలుగ నెదుగుచున్నది. మహిళాభ్యుదయమునకీ యుద్యమ మెంతేని సహాయపడగలదను నమ్మిక గ్రంథాలయశాస్త్రము నిదర్శనము లొసగుచున్నది. ఆచరణమునపని. ఈ యుద్యమ తత్వమున శ్రీశ్రీ బరోడామహారాజాగారు శారదాదేవికి నిరంతర కానుక లర్పించుచు మణిప్రాయులై యున్నారు. వారు పోషించుచుండు ఒక్కొక్క గ్రంథాలయమందును స్త్రీశాఖ—శిశుశాఖయని నేర్పాటు గావింపబడి యమితోత్సాహముతో పని జరుగుచున్నది. ఉద్యమాభిమానుల నేకులు శ్రీవారి యుదారాశయములను ఆదర్శముగ గైకొనుచున్నారు. తల్లి విద్యావతియైనయెడల సంతతి విద్యాగంధమును సులభముగ గ్రహించుననుట యనుభవసిద్ధము. దేశకల్యాణము స్త్రీలమీదను—శిశువులమీదను ఆధారపడియున్నదిగాన వారి విద్యావ్యాప్తికై ప్రత్యేక అవకాశములు గల్పించుట మనకర్తవ్యము. ఒక్కొక్క గ్రంథాలయమందును స్త్రీలచే నడుపబడు శాఖ యుండుట ఆవశ్యకము. గ్రంథాలయ ప్రియులైన నారీమణుల సహాయమున నెంతేని పనిజేయవచ్చును. వీలుకలిగినప్పుడే రెండు

పంక్తులైనను చదువుకొనుదని స్వచ్ఛందసేవకబృందము స్త్రీల కనువగు గ్రంథములను వారియిండ్లకే గొంపోయి యొసగుట ప్రథమపద్ధతి. బైబిల్ సొసైటీవారు స్త్రీల చేత నెట్టి మతప్రచారము గావించుచున్నారో ఆ పద్ధతినే మననారీమణుల విద్యావ్యాప్తికై పని ప్రారంభించుట కనీసధర్మము. గ్రంథాలయములలో నారీమణులను ధారాళముగ సభ్యులుగ జేర్చుకొనవలయును. ఎట్టియడ్డంకులునుండరాదు. వారికి గౌరవోద్యోగములు కూడ మనఃపూర్వకముగ నొసగవలెను. గ్రంథాలయములను మహిళాసమాజములుగను యుపన్యాసశాలలుగను జేయుటయు వారిని తగు ప్రోత్సాహములో గ్రంథాలయములకు రావించి విద్యాగంధ మర్పించి వివిధరాష్ట్ర, దేశ, నారీమణులెట్లు విజ్ఞానవ్యాప్తి నొందుచున్నారో జూపుటయు మనకర్తవ్యమే. జ్ఞానదానమునకంటె ఈవికలదా? మన మీకర్తవ్యమును మఱచితిమా సంసారశకటమునకు గట్టబడిన అశ్వద్వయములో నొకటికుంటుపడిన ప్రయాణమెట్లు దుస్సాధ్యమో అట్లే దేశాభ్యుదయమునకుకూడ మార్గము మృగ్యము.

వసంతఋతుసూచకముగ కోయిలలు కుహూకుహూ ధ్వను లొనర్చునట్లు దేశకల్యాణ దీక్షాపరులు నారీమణులకు తగు వసతు లేర్పాటుజేయుచుండుట మోదావహము. గ్రంథాలయములను స్త్రీ లెట్లుపయోగ పఱచుకొనుచున్నారను ప్రశ్న జనించుచున్నది. మహిళాభ్యుదయమును దేశము ఆతురతతో నిరీక్షించుచున్నది. వారికిగాను కొన్నికొన్ని గ్రంథాలయములలో ప్రత్యేకశాఖ లేర్పఱుపబడుచున్నవి. నారీమణుల విజ్ఞానాభివృద్ధికై 'వివేకవతి' 'గృహలక్ష్మి' 'భారతి' వంటి పత్రికారాజములు కంకణములు గట్టుకొనినవి. ఈ పత్రికారాజముల వ్యాప్తివలన అజ్ఞానావృతమైన మహిళామండలము దివ్యదీప్తుల నీనుచున్నది. కొన్ని కొన్ని పత్రికలు మహిళాభ్యుదయమను శీర్షికక్రింద నారీమణులవ్యాసములను విరజిమ్ముచు నారీమణుల సౌభాగ్యమునకై పాటుపడుచున్నవి. ఆంగ్లమున నడుపు పత్రికలలో గూడ స్త్రీ శాఖ శీర్షిక లుదయించినవి. గ్రంథాలయోద్యమములో పత్రికలు మీగడ తఱకలవంటివి. వానిసేవ అమూల్యము. 'గృహలక్ష్మిని' యింటింటికిగొంపోయి విరామముగనున్న గృహలక్ష్ములకు గ్రంథభాగమును జదివి వినిపించి శ్రుతపాండిత్యము (readership) నభివృద్ధి చేయుచుండు నారీమణినిజూచి సంతసించి యట్టి విజ్ఞానమునకు హేతుభూతమైన 'గృహలక్ష్మికి' మనమున ధన్యవాదము లర్పించి ప్రచారబాహుళ్యమునకై వాగ్దేవికి కుసుమముల నర్పించితిని. వివిధదేశములలోని నారీమణులు జూపుచుండు పట్టుదలలో మన వారి ప్రయత్నము బాల్యదశయందే యున్నదనియు సౌష్ఠవమును బొందుటకు అవకాశము లమితముగ యొసంగుట మన విద్యుక్తధర్మమని మనవి. శారదా పాఠశాలలు విరివిగా స్థాపింపబడవలయును. శారదను నారీమణులు నిజహస్తములతో పూజించి దేశాభ్యుదయమునకు దోడ్పడవలయును. శారదాకరుణాకటాక్షమునకు ప్రసన్నులు గావలయును. 'విద్యయే విశ్వమునకు వెలుగను' దివ్యసూత్రమును మననారీమణులు మఱువరాదు. మనము వారికా వెలుంగు నొసంగవలయును. జ్ఞానజ్యోతిని వారికందించి వారొనర్చు నీరాజనములతో వాగ్దేవియొక్క దివ్యకళలనుజూచి దేశమానందింపవలయును. శారదాపూజకు నారీమణుల యగ్రతను ప్రబోధము గావింప సమయమే తెంచినది. ఆంధ్రసోదరసోదరీమణు లీయవకాశమును గ్రహించి దేశకళ్యాణ దీక్షాతత్పరులై మెలంగెదరుగాక!

# మూడు నక్షత్రాలు

పినపాల వేంకటేశ్వరరావుగారు

(స్వర్ణయుగ పరిషత్)

ఆ మూవురూ మూవురు అపూర్వమహిళామణులు. చరిత్రాకాశంలో అనంతంగా ప్రకాశించే మూడు నక్షత్రాలు. మానవ ప్రపంచకానికి క్రొత్త క్రొత్తకాంతులను ప్రసాదించిన మూడుదివ్యజ్యోతులు. శౌర్యాగ్ని జ్వాలలను లోకానికి చవిజూపిన మూడు ఘోరాగ్ని పర్వతాలు.

వారు నివసించినది ఒకేదేశంలోకాదు; ఒకేకాలంలోకాదు; ఒకేపరిస్థితుల్లోకాదు. వారి దేశకాలపరిస్థితులకు, ఎన్నోఅఘాతాలూ, ఎన్నోపర్వతాలూ, ఎన్నోమహాసముద్రాలూ అడ్డు. ఒక ఆమె బ్రిటిషు స్త్రీ. నివసించినది బ్రిటిషుదేశ చరిత్రాదిలో; రెండో ఆమె ఫ్రెంచియువతి; జీవించినది ఫ్రాంసుదేశ మాధ్యమికయుగంలో. మూడో ఆమె హిందూదేశపురాణి. పాలించినది హిందూరాజ్య పతనావస్థలో. కానీ వారు మూవురూ ఒకటే మూవురిఆత్మలూ ఒకటే .గగనతలాన్ని చుంబించే ఆశయాలలో ఒకటే. రణరంగంలో శత్రువులపై ప్రళయతాండమాడటంలో ఒకటే. దర్శనం కోసం, దేశంకోసం, మానం కోసం ప్రాణాలను 'బలిదాన'మీయడంలో ఒకటే.

స్త్రీ లనుపించుకోదగ్గ సిసలైనస్త్రీలు వారు. తరిణిబట్టినజాతి రత్నాలువారు— మూవురూ మూడునక్షత్రాలు.

వారెవరు?...

ఒకటోనక్షత్రం—

దర్బారు నలువైపులా నిశ్చలతఘనీభవించినదా అనిపిస్తూ రోమనునగ్న స్త్రీ ప్రతియులు. అట్లే సభికులూ.

అంతానిశ్శబ్దం

ఇంతలో ఏదో స్త్రీకంఠం. రోమనుదర్బారులో నోరెత్తగల అంతసాహసమూర్తి ఎవరబ్బా!

"ప్రభూ! వందనాలు నాబిడ్డలు దిక్కులేనిపక్షులు. వారి రాజ్యభాగాన్ని వారికిప్పించండి"అంటూ విన్నవించుకొంది ఐసీనియూరాణీ_బాడీషియా వినయంగా.

ప్రభువు నేత్రాలు చింతనిప్పులు. మోము కందగడ్డ. చూపులు అతితీక్షణాలు.

"దానిని స్తంభానికి చేతులు విరిచికట్టి 'చడేల్ చడేల్'న చర్మం బ్రద్దలయ్యేటట్లు చావమోదండి. బిడ్డలకు మానంభంగం చెయ్యండి"అనే భయంకరకంఠధ్వని ఆవిశాల సౌధమంతటా మారుమ్రోగింది.

భర్త మరణించినపుడు తనబిడ్డలకు వ్రాసియిచ్చిన రాజ్యభాగాన్ని ఆక్రమించుకోవడం అన్యాయమని మనవిచేసుకొన్నందుకా ఈశిక్ష! ఇప్పుడైనా తనబిడ్డల రాజ్యం తనబిడ్డల కిప్పించమని వినయంగా వేడుకొన్నందుకా ఈశిక్ష! ఎంతటిన్యాయం!

ఆమె వీరరక్తం నాళనాళానా స్రవిస్తూఉన్న బ్రిటిషుస్త్రీ అని తెలీదేమో! విషజ్వాలలను వెలికి ఉమిసే భయంకర కాలసర్పమని తెలీదేమో! ముసుగులు వేసుకొని అలంకారాలతో అంతఃపురంలో తిరిగేసామాన్య రాజకాంత అనుకొన్నాడేమో పాప మా ప్రభువు!

మరునాడు, "మానరోషాలున్న మగవారైతే మీరంతా నావెంటనడవండి; పిరికిపందలైన బ్రిటిషుబానిసలైతే రోమనులపాదాలొత్తండి" అని బ్రిటిషుప్రజల నుత్సాహిస్తూ పలికిన బాడేషియా ప్రబోధవాక్యాలు ఆప్రభువు గుండెల్లో ప్రతిధ్వనించాయి. ఆమెకత్తికి ఎనభైవేలమంది రోమనువీరులు బలియైనారంటే ఎక్కడలేని ఆశ్చర్యం కలిగింది.

"అబ్బా" అంటూ అనూయా విషపూరితమైన ఒక నిట్టూర్పువిడిచాడు.

ఎంతోకష్టంమీద రోమనులు ఆమెను బంధించగలిగారు కానీ వారికి దొరికింది ఆమెశవంమాత్రమే! అదివరకే విషంత్రాగి వీరస్వర్గంచేరుకుంది ఆవీరమాత బాడేషియా.

చచ్చిపోయిన బ్రిటిషురక్తంలో, నాటినుండే ఏదో ఉద్రేకం!

* * * *

రెండోనక్షత్రం.

నిశి. భయంకరంగా గాలిదేవుడు. మదగజాల్లాఆకాశంలో పరుగులుతీస్తూ మేఘాలు. పెళపెళామంటూ నిశ్శబ్దాన్ని చీల్చుకొంటూ మేఘగర్జనలు. అంతా బ్రహ్మాండమైన తుపాను.

ఆ గొల్లభామ మనసులోకూడా ఉరుములూ, మెరుపులూ—ఏదో తుపాను అంతా అల్లకల్లోలం—

ఆ నిశీథంలో ఆమె సూక్ష్మదృష్టికేదో వెలుగులా తోచింది. "నీదేశదాశ్య విముక్తికై పాటుపడరాదటే బాలా" అంటూ ప్రబోధించినట్లుగా అనిపించింది. ఇదంతా ఒక్కక్షణం. ఆవెలుగు ఆకారుచీకటిలో మెరిసినమెరపో మరేమిటో పోల్చుకోలేకపోయాయామె చిరునేత్రాలు.

ఆమెరక్తం వేడెక్కిపోయింది. గుండెలు దడదడలాడాయి. కాచిన సీసులా ఆమె వీరరక్తం నాళనాళానికే స్రవించింది. ఆపాదమస్తకమూ ఎర్రగా కందిపోయింది. శరీరం

నిప్పులముద్దయిపోయి వెచ్చనిఆవిరులను వెలికిగ్రక్కింది. ఆమె ఉన్మత్తురాలైపోయింది. ఆవేశంతో ఎగిరిచిందులు త్రొక్కింది.

ఎన్ని ప్రళయాలను సృష్టించబోతోందో, బక్కగుఱ్ఱంమీద ఉరుకులుపెట్టె అగ్గొల్ల భామ!

శత్రువులు ఆమెను "సైతాన్"అన్నారు. ఉక్కుస్తంభానికి గట్టి, చుట్టూమంటలు పెట్టి కాల్చివేసారు, ఆవీరయువతి—జోన్ దేవిని.

ఆబాలికను శత్రువులకు అప్పగించిన దేశద్రోహులు—బర్గండీయుల కనులు తెరచుకొన్నాయి. ఆమె తమ దేశానికిచేసిన ఉపకారానికీ, వారు ఆమెకుచేసిన అపకారానికీ ఎంతో పశ్చాత్తాపపడ్డారు. వారికనులవెంట రాలే బాష్పకణాలు కాల్వలుగట్టి 'సీన్' నదిలో కలసిపోతునే ఉన్నాయి నేటివరకూ!

కానీ, నాటికీ నేటికీ ఫ్రాంసుదేశచరిత్రలో ఆ మచ్చమచ్చగానే వుంది!

* * * *

మూడోనక్షత్రం—

గుఱ్ఱంపరుగులు తీస్తూనేవుంది. ఆమెచేతిలోని కత్తికనులుచెదరేలాగు తిరుగుతూనే వుంది. ఆకత్తి విసురుకు ఎన్నికుత్తుకలు తెగిపోయినవో తెలీదు! ఎన్నిదాడులు వెనుకకు మరలినవో కానరాదు! ఎన్నిరక్తప్రవాహాలు పారినవో అగోచరం!

అహో! ఎవరికోసం తానుయుద్ధం చేయవలసివచ్చిందో ఆపెంపుడు పిల్లవానిని వీపునకు కట్టుకొని మగవేషంతో రణరంగంలో దురికిన ఆవీరవనిత ఎవరు? వైరివీరుల పాలిటి మృత్యుదేవతలా, శత్రువుల రక్తంతో భూదేవిని అభిషేకంచేసే ఆవీరమాత ఎవరు? రఘునాధునిరాణి—నిస్సహాయ—ఝాన్సీ రాణీయా! ఆశ్చర్యం!!

వీరస్వర్గమునుండి ఊడిపడిన ఏపురాణస్త్రీయో కాదుగదా!

ఆమె విరోధులపాలిటి 'సైతానా?' పిశాచమా? పెనుభూతయా? బ్రహ్మరాక్షసియా? ఏమో! వారికే అగోచరం!!

ఝాన్సీభాయి ఇప్పుడు ఒంటరికత్తె నిస్సహాయ చుట్టూతండోపతండాలుగా సైన్యం ఒకస్త్రీపై ఎన్నోబాణాలు—ఎన్నోకత్తులు—ఎన్నోతుపాకీ ప్రేల్పులు—ఎన్నోబాంబులు చివరికొక బాంబుగుండుతో ఈలోకం విడచింది ఆస్వాతంత్ర్యజ్యోతి—ఝాన్సీభాయి

ఝాన్సీభాయివంటి వీరమాతలనుకన్న భరతమాత ధన్యురాలు!

# ఇది ఇంకో ప్రపంచములో

చ. రా.

నా కాలేజీ మధ్యాహ్నము కడపటిపీరీడు పని లేదు. ఇల్లు కాలేజికి అర మైలు దూరములో నేవుంది. అది ఎండకాలము; అందులో చెన్నపురిలో (యీపూళ్లో hot, hotter seasons రెండేవుంటవి గాబట్టి) రెండు గంటలకు మరల కాలేజీలో నుండాలి. ఈ లోపలనే యింటికి వెళ్లి ఒక్కకునుకు తీసి ఫలహారమూ అదీ చేసి రావచ్చునని యింటికి వెళ్లాను. మేడపైనగదిలో తలుపుదగ్గరగా పడకకుర్చీ వేసి పనిచేయకపోయినా అలసటగా వుంటూవుండే నాశరీరాన్ని అందులో పడవేశాను. ప్రక్కనవేవున్న ముందటిరోజు పత్రికను దీసికొని పేజీ లిటూఅటూ తిరగవేయడానికి ప్రారంభించాను. అందులో ఒకచోట 'భగ్నహృదయుల ఆత్మహత్యలు' అని పెద్దక్షరాలతో కనిపించింది. ఏమిటా అని చూచాను. ఎవరో ఒక అబ్బాయి అమ్మాయి ప్రేమించుకొన్నారట. పెళ్లాడే దారిలేకపోతే ఆత్మహత్య చేసికొన్నారట. ఇది సారాంశం. ఇటువంటివెన్నో యీపాడు ప్రపంచంలో అంటూ ఆలోచలో బడిపోయాను. ప్రక్కన నిలబడి ఏదో సణుగుతూ వుంది దేవి; నేనదీ వినిపించుకోలేదు. నాచేతిలోని పత్రిక యెపుడు క్రిందపడిపోయిందో, నాఆలోచన లెంతవఱకు సాగి ఆగిపోయాయో మాట్లాడనందుకు కోపముతో మా దేవిగారేమి ప్రతిజ్ఞలచేసి వెళ్లారో నాకేమీ జ్ఞాపకంలేదు.

*　　*　　*

ఎంతోమంది ఎన్నో ఘోరమైన నేరాలు చేస్తూవుంటారు. వారివంక చట్టము తేరిపార చూడలేదు.

ఎందుకు?

సంఘం వారికి శ్రీరామరక్ష. అందులోని ఆచారాలు కట్టుబాట్లూ వారికి వజ్రకవచాలు. న్యాయాయుధాల్తో వీనిని చీల్చివేస్తే?

ఎంతమంది నేరస్థులు?

ఎంతమంది హంతకులు?

హైకోర్టులో ప్రధాన న్యాయమూర్తి స్థానంలో కూర్చునివున్నా. నాలాగే స్వదేశీయుల్లో మెళ్ళో తెల్ల పీలికలు, పీకబిగింపులు లేకుండా గాలి నిరాఘాటంగా వచ్చి పోవడానికి వీలుండే జిబ్బాలూ ధోవతులూ ధరించి న్యాయవాదులంతా క్రిక్కిరిసివున్నారు. ప్రేక్షకుల స్థానంలో స్థలమెంతమాత్రమూ వున్నట్లే లేదు. అపుడు నావద్దకు అప్పీలుకు వచ్చివుండే విచిత్రమైన కేసు ప్రభావమే యిదంతా.

ఆ కేసు వివరాలు క్రిందటి కోర్టుజడ్జిమెంటు ఆ ముందురాత్రి ఆదినం తెల్లవారి కోర్టుకు వచ్చేంతవఱకు చదివి ఆలోచిస్తూనేవున్నా. అనంతపురంలో రఘుపతిరావు డిప్టీకలెక్టరు. ఆయనపత్ని జానికమ్మ. వీరి కుమారుడు ఆనందరావు. అపుడు బి.ఎ. తరగతి చదువుతూవుండేవాడు. వారింటిముందే నారాయణరావు దుర్గాబాయి దంపతులుండేవారు. వారికి కమల ఒకతేకుమార్తె. మెట్రికులేషన్ చదువుతూవుండేది. కమలాఆనందరావులు పరస్పరము ప్రేమించుకొన్నారు. వారిద్దరూ వివాహమాడడానికేలాటి అడ్డంకులూ లేవు. కాని రఘుపతిరావు నారాయణరావు జానికమ్మ దుర్గాబాయికూడా యీ సంబంధాని కొప్పుకోకపోతే ఎన్నోవిధాల చెప్పిచూచి ఉపయోగంలేకపోతే ఆనందరావు కమల ఆత్మహత్యచేసుకున్నారు. ఆనందరావు తాను చనిపోవుటకుముందే తమమృతికి తమ తలిదండ్రుల అసమ్మతే కారణమని నిరూపిస్తూ పోలీసు

వారికొకవుత్తరం వ్రాసివుంచాడు దానిపై పోలీసువారు రఘుపతిరావు జానికమ్మ నారాయణరావు దుర్గాబాయమ్మ గారలపైన కేసు పెట్టారు. అనంతపురం సెషన్సుజడ్జి యీ కేసు విచారించి ప్రతి వకరికీ పదేళ్లు కఠినశిక్ష వేశారు. ఇది అన్యాయమని హైకోర్టులో నావద్ద యీ కేసు అఫీలుకువచ్చింది. ఇది అసలుకథ.

కేసు ప్రారంభించడానికి అనుమతియిచ్చాను. క్రిందకోర్టులో కేసుకు సంబంధించిన రికార్డంతా నా బల్లమీద ఒకపైపుగావుంది. నిందితుల బోనులో రఘుపతిరావు జానికమ్మ, నారాయణరావు దుర్గాబాయి నిల్చునివున్నారు. కోర్టంతా నిశ్శబ్దంగావుంది. ఈ కేసుకు జ్యూరీలను ప్రత్యేకంగా యేర్పరచి పిలిపించాను. వారందరు తలిదండ్రుల వొత్తిడికో పెద్దలభయానికో చిన్నపుడు తమ కొంతమాత్రమూ యిష్టములేకుండా ప్రేమించినవారిని విడిచిపెట్టి యితర వాళ్లను పెళ్లాడి జీవితమంతా ఆ ఆనందాన్ని అనుభవిస్తున్నవారే.

కేసును పునర్విచారణ జేయవలసిన ఆవశ్యకత నాకేమీ కనిపించలేదు. కాని నిందితులు తాము దోషితులని ఒప్పుకుంటారా లేదా అనే విషయము ముందు తేలవలసివుంది. తదుపరి యిటువంటిది చట్టముదృష్టిలో నేరమేనా అని నిర్ణయింపవలసివుంది. అంచేత మొదటిదాన్ని నిర్ణయించుకోడానికి నిందితులను జూచి 'మీరు ఆనందరావు వ్రాసివుంచిపోయిన వుత్తరాన్ని యెఱుగుదురుగదా' అన్నాను. ఔనన్నారు. ప్రాసిక్యూటరుతో ఆనందరావు వ్రాసిన ఈ త్తరము కడపటిభాగాన్ని చదువమన్నా. ఆయన ఈలా చదివాడు.

'ఆరాత్రే మానాన్నా మాఅమ్మా రాజమండ్రి సంబంధాన్నిగూర్చి మాటాడుకుంటూవున్నారు. ఆ అమ్మాయి యింటరు చదివిందనీ, జిల్లాజడ్జికూతురనీ, ఐదువేలుకట్నమనీ, నన్నింక చదివించడానికి సహాయం కలుగుతుందనీ, అంచేత తప్పకుండా ఈ వేసవి సెలవుల్లోనే పెళ్లిచేయాలనీ, మరుదినం తెల్లవారి నన్నడిగి అందరుఒప్పుకున్నారని వ్రాయదలంచుకున్నామనీ అనుకున్నారు. నాప్రాణాలు పైకెగిరిపోయాయి. అంత త్వరగా పెళ్లివిషయం వస్తుందని నేననుకోనివుండలేదు.

తెల్లవారి భోజనానంతరం మాఅమ్మా నాన్నా నన్ను పిలిచారు. సంబంధం సమాచారమంతా చెప్పారు. దాన్ని వేవిధాలగా వర్ణించారు. నాకు ప్రాణాల్లో ప్రాణాలు లేవు. తుదకు నా అభిప్రాయ మేమిటని అడిగారు.

'పెళ్లి కవసరమేమి? ఇంకా ఎంతో చదవవలసి వుందని మీరేఅన్నారు' అని ఎప్పటిలాగే తప్పించుకోడానికి చూచాను.

'అందుకే మరి. చదువుక్కూడా సహాయంచేస్తారని చెప్పలా? సరే. నేనువ్రాశేస్తాను వారికి అన్నీ నిర్ణయించుకొమ్మని. ఇటువంటి సంబంధం దొరికిందని సంతోషించు.'అని ఒక ధోరణిలో మాట్లాడారు మానాన్న.

'నాన్నా—'అని వారివైపుచూచాను.

'ఇంకా ఏమిటి?' అని విసుగు చూపించారు.

'నాకిపుడు ఏసంబంధమూ అక్కర్లేదు. ఈ సమాచారం మీతో ఇదివఱకెన్నోమార్లు చెప్పాను.'అని దీనంగా వారివైపుచూచాను.'

నిందితుల బోనులోనుండి జానికమ్మ యేడ్పు వినిపించింది. పోలీసుజవాను ఊరకుండండిఅని గద్దించాడు.

ప్రాసిక్యూటరు తన చదువు సాగించాడు.

'నీఖర్మం ఏంకాలింది? ఇలాంటి దుర్బుద్ధులు పుడుతున్నా యేమిటిరా? ఇకచాలించు. మురిపెముగా ఒకడేనని పెంచినందులకు బాగా తయారయావు. ఇంత మంచి సంబంధాన్ని వద్దంటావు' అని గద్దించాడు మానాన్న.

'ఎదుటింటికి అంతచనువుగా పోవద్దని నేనెన్నోమార్లు చెప్పానుకూడా. పీడింతకువచ్చాడు' అన్నది మాఅమ్మ.




వేణుగానలోలుడు



పాశ్చాత్యదేశములందు గ్రామములందలి బాలబాలికల క్రీడలనుగూర్చి
ప్రత్యేకముగా నియమింపబడిన ఉపాధ్యాయులు శ్రద్ధవహించుట.

'ఓహో! అదా కథ. ఏమిటిరా! నారాయణరావు గారి అమ్మాయిని పెళ్లాడాలనివుందా?' అని హాస్యం చేశాడు నాన్న.

'అది కాదు నాన్నా. ఇప్పుడు—'ఇంతలో మా అమ్మ

'వీని ఉబలాటంచూస్తే అలాగే అనిపిస్తుంది'అంది.

'నిజంగా?'అని ఒక్కగంతేశారు మానాన్న.

నాకు సమయము చిక్కింది. తరువాత నేను ఏమి చేసినా ఉపయోగముండదనుకున్నా. నేను ఎంతో కాలంనుండి దాచుకొనివున్నది ఈసమయానికే. నా హృదయములోని అభిప్రాయాల్ని వారిముందు పెట్ట దలంచుకొన్నాను. కొంచం ధైర్యంతెచ్చుకుని

'నిజమేనాన్నా.కమల అన్నివిధాలా నాకు తగింది. మీరుకూడా అది ఎంతో మంచిదని అంటూవుంటారు. మేమిద్దరూ మూడేళ్ళనుంచీ ఒకరినొకరిని బాగా ఎరుగుదుము. మేము ఒకరినొకరు—'

నేను ముగించకముందే సింహంలాగ గర్జిస్తూ చాలించు! నీ వెధవకబుర్లు. ఇంతచదువూ, పెద్దకుటుంబము, ఇంతకట్నము, ఇన్నిలాంఛనాలూ, చదువుకు బోలెడంతడబ్బు—ఇన్నిటితో ఇంతమంచి సంబంధము విడిచిపెట్టి అపూటకాపూటకు అందుకులయ్యే ఏభై రూపాయల ఉద్యోగస్థుని కూతురినా పెళ్లాడాలని నిశ్చయించేవు—'అని ఎలక్ష్యూషనిస్టులాగ పదినిముషాలు గుక్కతిరుగకుండా ఏమేమోఅన్నాడు.ఆయన ముగించాకో లేదో 'ఈపెళ్లి చేసాలమూనేసి మీనాన్న గారు చెప్పినట్లు నడచుకో.' అంది తల్లిగారు ఇరవై యేళ్లనుండి పెంచిన గారాబాన్నంతా చూపిస్తూ—'

'తరువాత నారాయణరావుతో ఆనందరావు సంప్రదించడం చదవండి.'అన్నా పబ్లిక్ ప్రాసిక్యూటరుతో. ఆయన ఇలా చదివాడు.

'ఇష్టమువచ్చినట్లు పోనివ్వకుండా ఆటంకపరిస్తే పుట్టించిన తలిదండ్రులనూ, సృష్టించిన దేవుణ్ణికూడా లెక్కచేయకుండాచేసే వయస్సువాడి. ఆసాయంత్రం నారాయణరావుగారింటికి వెళ్ళాను. వారికి దుర్గాబాయికి మాయింటజరిగిన సమాచారాలు నాఉద్దేశాలు మాతండ్రిగారికీ నాకీ వున్న స్నేహము అన్నీచెప్పి నారాయణరావుగారిని కమలను నాకిచ్చి పెళ్లిచేయమనికోరాను. లేకపోతే నేనుస్వాతంత్ర్యంగా జీవించుట కొక వుద్యోగం సంపాదించుకొనేవఱకూ వూరకుండి తరువాతనైనా నమ్మకంగా నాకేయిచ్చి పెళ్లిచేస్తానని వాగ్దానంచేయమని ప్రార్థించాను. కమల తలుపు చాటునుంచి తొంగిచూస్తూ యేడుస్తూ నిల్చొనివుంది. నారాయణరావు తలవాలవేశారు. దుర్గాబాయి కాళీ స్వరూపందాల్చింది.

'మా తమ్ముడికి మొదటిపెళ్ళాం పోయినప్పటి నుండీ మాకమలనిచ్చి పెళ్లిచేయాలనివుంది. వానికింకా యిద్దరుబిడ్డలు. వాళ్లతో ఒంటరిగా బాధపడలేక చస్తూవున్నాడు. అంతే గాకుండా మేనరికం. పుట్టిల్లు సౌఖ్యంగావుండేటట్లు చూడాలి. అంతేగాని ఎవరికీ యివ్వను.మీరెందు కాయాశపడతారు'అని ముఖముటు త్రిప్పుకుంది.

'నీమాటవిని కమలను నీకివ్వడానికి నేను పూనుకుంటే నాఉద్యోగాన్ని మీనాన్నగారు ఊడబెరుకుతారు. నేను అష్టకష్టాలపాలవుతాను. ఇప్పటికే కమలకు పదహారేళ్లువచ్చాయి. నిదానిస్తే వుపయోగంలేదు. దుర్గాబాయితమ్మునికేయిస్తే బాగుంటుందని అనుకుంటున్నా. అతనికి మూడురూపాయల జీతం—' నారాయణరావు ముగించకముందే

'నావిన్నపము అంగీకరించి కొంతకాలం ఓపిక పట్టలేరూ? మీకేమీ భయమక్కర్లేదు–' అంటూ ఏమేమో పిచ్చివానిలాగ వదరుతూ అనేకవిధాల నారాయణరావును బ్రతిమాలాను.

నారాయణరావుకు నా దీనస్థితిచూచి గుండె నీరయింది. సానుభూతిచూపెడుతూ మాట్లాడినా యే నిర్ణయానికీ రాలేకపోయాడు. 'మాకమలను నీకిప్పుడూ

యివ్వము. ఎందుకు పూరికే యీరాద్ధాంతాలు. ఇక వెళ్లండి. చాలు కుద్రవాళ్ల వ్యవహారాలు.' అని దుర్గాబాయి నిరసించడం ప్రారంభించింది.

'మేనమామగారికి నన్నిస్తే నేనెక్కడో వురేసుకుంటాను. నాకొద్దు' అంది లోపలనుండి కమల. దుర్గాబాయి ఒక్కగంతు వేసింది. 'నీదుంపతెగా! ఇంత దానివైనావటే! నీకు మేనరికంవద్దు డిప్టీకలెక్టరుగారి అబ్బాయి కావాలా' అని లోపలికివెళ్లి యేమందో ఏమోకాని 'అయ్యో నాయనోయ్, చచ్చాను' అంటూ లోపలనుండి కమల కేక వేసింది. నారాయణరావు గారు లోపలికిపరువెత్తారు. బెల్లంగొట్టిన గుండ్రాయిలాగ కదలమెదలకుండా ఆలా నేకూర్చున్నా. ఆశాపాశం తెగిపోయింది.

లోపలనుండి నారాయణరావువచ్చారు. 'ఏమంటా'రన్నా. 'వుపయోగంలేదు. మీరువెళ్లడం మంచిది' అన్నారు—'

'అంతవఱకు చాలు దాన్ని మద్దాయీలకు చూపించు' అన్నాను ప్రాసిక్యూటరుతో. ఆ వుత్తరం నలువురు మద్దాయీలు చూచారు.

అంత నేను మద్దాయీలవైపుతిరిగి 'ఈవుత్తరం విన్నారుగదా! ఇందులోనిసంగతు లెంతవఱకు నిజం!' అని ప్రశ్నించాను. నలువురు పైన వ్రాయబడిన సంగతులన్నీ నిజమేనని అంగీకరించారు.

'అయితే కమలా ఆనందరావుల మృతికీ మీప్రవర్తనకు సంబంధమేమైనావుందని మీరు అంగీకరిస్తారా?' అని నిందితుల మరీ ప్రశ్నించాను.

'సంబంధ మేముంది? వాళ్లకర్మం గాకపోతే?' అన్నాడు రఘుపతిరావు వేదాంతధోరణిలో.

'ఆనందరావే మాకమలకొంపదీశాడు. వానివల్లనే కమల చచ్చిపోయింది' అన్నది పాముపగ చూపిస్తూ దుర్గాబాయి.

'మా స్వార్థపరత్వప్రవర్తనే మారాక్షసత్వమే వారిద్దరిమృతికి కారణం. వేరే ఏమీలేదు' అన్నాడు నారాయణరావు పశ్చాత్తాపాగ్నిని కన్నీట ఆర్పుతూ.

'నిజంగా. అదేకారణం' అంది జానకమ్మ అల్లారుముద్దుగా ఇరవైసంవత్సరములు పెంచి పెద్దచేసిన కుమారుని అన్యాయంగా పోగొట్టుకొంటినిగదా అనే దుఃఖంతో.

నిందితుల న్యాయవాది లేచి 'ప్రభూ! వీరి నలువురిలో ఇద్దరుమాత్రమే చనిపోయినవారి మృతికి కారణము తామేనని ఒప్పుకుంటున్నారు. అదికూడా వారికిగలిగిన దుఃఖాతిశయముచే వారాలా అంటున్నారుగాని నిజంగాగాదు. కాబట్టి అదొకకారణంగా దేవరవారు లెక్కింపకూడదు. అని నామనవి.' అని నిందితులు హృదయపూర్వకముగా అంగీకరించే దోషమును న్యాయదృష్టిలో తుడిచివేయాలని ప్రయత్నించాడు ఆ న్యాయవాది.

'అయితే చేసినతప్పును హృదయపూర్వకంగా పశ్చాత్తాపంగలిగి తమదోషాన్ని ఒప్పుకోవడంగూడా న్యాయము గమనింపకూడదన్నమాట' అన్నా న్యాయవాదితో. అందరు నవ్వారు.

ప్రాసిక్యూటరుతో 'విచారింపవలసిన విషయము లేమీ లేవు. మీ మీవాదనల కానివ్వచ్చు' అన్నా.

ప్రాసిక్యూటరు లేచాడు. తలపాగా క్రిందపడిపోతుందేమో తన ఆర్గ్యుమెంట్సుమధ్య అని చక్కా-ఒత్తుకున్నాడు. జిబ్బా క్రిందకు సరిగా యీడ్చి కూర్చున్నప్పుడు పడినమడతల సరిచేసుకున్నాడు. జేబులోనుండి చేతిగుడ్డతీసికొని కొనల రెండుచేతులతోనూ పట్టుకొని నడిమిభాగం నాసికరంధ్రాలవద్ద అటూ ఇటూ నాలుగుమార్లుతీడ్చి విదిలించి చేతితో పట్టుకున్నాడు వుండగా. గొంతుసవరించుకొన్నాడు. ఈలా ఆరంభించేశాడు.

'న్యాయమూర్తి! జ్యూరీ మహాశయులారా! కేసువివరాలన్నీ మీరంతా చదివేవున్నారు. ఈ హత్యాపరాధములో చనిపోయిన కమలాఆనందరావులు తలిదండ్రులు తమవుద్దేశాలకు ఆటంకం కలిగించేటంతవఱకు అన్నివిధాలా సంతోషంగానేవున్నారు. వారికేలాటి సంకటాలూ లేవు. ఇది మొదటివిషయము.

రెండవది. కమల ఆనందరావు వారిష్టమువచ్చినట్లు వివాహమాడడానికి ఆటంకంకలిగిస్తే వెనక ఎంతో బాధలతో జీవితాలుగడుపుతారని వారు స్పష్టపరచారు. కమల తాను ఆత్మహత్య చేసుకుంటానని కూడా చెప్పింది.

మూడవది. పిల్లలకు తమవిషయములు అర్థముచేసికొనుటకు తగినంతజ్ఞానము లేకుంటే తలిదండ్రులు వారిని బలవంతపెట్టినా భయములేదు. ఈ కేసులో బాధింపబడినవా రిరువురూ చక్కగచదువుకొని ప్రపంచజ్ఞానమెఱిగి తమకష్టనష్టములు గుర్తించినవారే.

నాల్గవది. వివాహం వద్దనడానికి కారణం స్వార్థపరత్వముతప్ప వేరేయేమీ లేదు. ఇందు తమఆశయాలను పరిపూర్తి చేసికొనడానికి ఇతరులను బలియివ్వాలనే నికృష్టాభిప్రాయం స్పష్టమౌతూంది. ఈవిషయమై ఆనందరావే తనవుత్తరం కడపట ఏమివ్రాశాడో చూడండి. 'నాసౌఖ్యం చూస్తూన్నానని మాతండ్రి చెప్పడం లోకాన్ని మెప్పించడానికి. అది అసత్యం. తనకు గొప్పవారు వియ్యంకులు గావుండాలనీ, కట్నం డబ్బు పెట్టెలనిండాలనీ, చదువుచెప్పించడానికి డబ్బు సులభంగారావాలనీ మా నాన్నగారి అభిప్రాయం. దానికి నన్ను నాజీవితసౌఖ్యాన్ని బలియివ్వ దలంచారు. దీనికి మాతల్లితోడయింది. ఇరవైయేళ్లుగా నన్ను వారంత గారాబముగా పెంచింది ఇందుకే అయితే వీరికన్నా రాక్షసులు నయం.

ఇక నారాయణరావు దుర్గాబాయి అంతే. దుర్గాబాయి తమ్ముని సుఖపెట్టాలనీ, కూతురిని పుట్టినింట వుంచాలనే చూచిందిగాని మరేవిషయం గమనించింది గాదు. అలాచేస్తే ప్రాణంతీసికొంటానని కూతురు చెప్పినా రాక్షసిలాగ మీదపడిరక్కిందేగాని కన్నకూతురని కరుణ లేశమైనా చూపింది గాదు. ఇందులో అన్యాయం కళ్లారా చూచినా నారాయణరావుగారు ఆమెకే తోడ్పడ్డారు.

ఇటువంటి స్వార్థపరుల ఆశయాలకు బలై జీవితకాలమంతా జీవచ్ఛవాలలాగు బ్రతికేదానికంటె మేముచావడం మెఱుగని నిశ్చయించాము. మా చావుకు వీరు నలువురుతప్ప వేరేమీ కారణంలేదు. పుట్టించినవారికి చంపేహక్కుకూడా వుంది అని సంఘం ఒప్పుకొని దీన్నిసహించి విడిచిపెట్టితే తప్ప వీరందరినీశిక్షించి మా అటువంటి నిర్భాగ్యులికమీదనైనా బాగుపడేటట్టు చేయవలసినబాధ్యత ప్రభుత్వం మీదవుంది.'

దీన్ని ఎవరూ కాదనలేరు. కాబట్టి ఈనిందితులకు క్రిందికోర్టులో యివ్వబడినశిక్ష ఇక్కడకూడా ఖాయపరుచాలని నామనవి.'

నిందితుల న్యాయవాది లేచాడు. నిందితులవంక చూచి సాభిప్రాయంగా నవ్వాడు. చేతులచొక్కా మడచుకొని చిన్నగాదగ్గాడు. "న్యాయమూర్తీ! జ్యూరీ మహాశయులారా! అసలు నా మొదటి ఆర్గ్యుమెంటు ఏమిటంటే యీ నేరము హత్యానేరము కానే కాదని. దీన్ని హత్యఅనడానికి చట్టమంతా పరిశోధించినా ఆధారం కనపడడంలేదు. పోనీ నిందితులే అంగీకరిస్తావున్నారే అంటే వారికికలిగిన దుఃఖమువలన వారాలా అంటారేగాని నిజానికిగాదు. ఇంతే గాకుండా చట్టదృష్టిలో ఇది నేరాలేగాదు. ఈ చట్టవిరుద్ధమైన నేరాన్ని కల్పించి వీరి నీవిధంగా నిర్బంధించినందులకు ప్రభుత్వమువా రేమిచెప్పదురో చూడవలసివుంది. వీరిని తక్షణం విడిచిపెట్టాలి.

తరువాత. తలిదండ్రులకు తమపిల్లల వివాహాది విషయాల్లోసర్వాధికారాలువున్నవి. వారివి యిష్టము వచ్చినట్లు వినియోగించుకోవచ్చు. ఈ సాంఘిక హక్కులో చట్టము జోక్యము కలిగించుకోగూడదు. పిల్లలు తమయిష్టప్రకారము వివాహముజరగలేదని ఆత్మహత్యగావించుకొని తలిదండ్రులు ద్రోహులంటే అంతకంటె వింతఏమీవుండదు. ఆలాఅయితే ఆత్మహత్యలు చేసుకునే వాళ్లంతా ఏదోక్రోధభావంతోనో

ఎవరో కారణమంటూ వ్రాసిపుంచిపోతే వారంతా శిక్షింపబడవలసినదే. వీరు నిర్దోషులు. ఏహత్యచేయలేదు. చనిపోయినవారు స్వహస్తాల్తో ప్రాణాలుతీసుకొన్నారు. వీరినివెంటనే విడిపించడానికి వుత్తరువు దయచేయాలి. జ్యూరీమహాశయులకంతా ఈవుత్తరువు ఎంత సమంజసంగా వుంటుందో తెలిసేవుంది.” అని జయించిన వాడుమల్లె వికసించిన ముఖంతో కూర్చున్నాడు.

జ్యూరీల అభిప్రాయం తెలుసుకోడానికి కొంతసేపు పట్టింది. వారు తుదకు ఇచ్చిన అభిప్రాయం ఇది. “నిందితులే దోషులనట స్పష్టము. కాని చట్టము దృష్టిలో ఇదినేరము కాదు.”

అంతా నా తీర్మానానికి చెవులు నిక్కించి చూస్తున్నారు. నాతీర్మానమిది. నిందితులు నేరుగా హత్యచేయకపోయినా ఇండైరెక్టుగా వారి మృతికి కారణమయ్యారు. ఆసంగతివారే అంగీకరిస్తూవుంటే కాదనడం సరికాదు. కాని వారు చనిపోతారనే సందేహం నిందితులకు లేకనే ఆలాప్రవర్తించారు. ఆది తమపిల్లల కింతమాత్రమూ యిష్టంలేదని యిష్టంలేని బలవంతబ్రాహ్మణార్థాలవలన కలిగే కష్టనష్టాలచే ప్రపంచమంతా బాధపడుతుందని వారికి బాగా తెలుసు. అదీగాకుండా ఉన్నతవిద్యాధికులైన రఘుపతిరావు నారాయణరావు అన్నీ తెలిసి ఆలాచేయడం నేరము తప్పక ఔతుంది. ఇప్పటి న్యాయచట్టములో ఇట్టి నేరాలకు శిక్ష ఎక్కడావిధింపబడలేదని విడిపించేటందుకు వీల్లేదు. చట్టము కలగచేసికొనదని సంఘము తన యిచ్చవచ్చినరీతి ప్రవర్తిస్తూ ఘోరహింసలకు ఆత్మహత్యలకు నిలయమై పోతూవుంటే చట్టమే తప్పక సంబంధం కలుగచేసికోవాలి. నేనీ నేరాన్ని 302 వ సెక్షనుక్రింద ఒక సబ్‌సెక్షనుగా ఎంచుతున్నా.

నిందితులలో రఘుపతిరావు దుర్గాబాయి వీరిద్దరు చాలాక్రూరంగా వర్తించారు కాబట్టి వీరికి క్రిందికోర్టు శిక్షనే ఖాయపరుస్తున్నాను. నారాయణరావు జానికమ్మ పైవాళ్లకు ప్రక్కతాళాలువేశారు. కాని యిప్పుడు తమతప్పుకు పశ్చాత్తాప పడుతున్నారు. కాబట్టి వీరిశిక్షను చెరిఐదుసంవత్సరాలు తగ్గిస్తున్నా. ఈశిక్షలు ఇతరావారికి మార్గదర్శకంగా వుంటవని అనుకొంటాను.

నాతీర్మానం ముగించానో లేదో కోర్టులో పెద్దగోల చెలరేగింది. నిందితులు రోధనధ్వను లందులా కలసి చెవులు చిల్లులుపడ్డాయి.

*   *   *

మాదేవిగారు ప్రక్కననిలబడి ‘ఏమిటి మధ్యాహ్నం ఈ కుంభకర్ణుల నిద్ర. రెండుగంటలౌతూంది ఇంకాలేవరేం? కాలేజీకిపోరూ?’ అంటూ చెవిదగ్గర అరుస్తూవుంది ఫలహారమంతా బల్లమీదపెట్టి.

కళ్లు నలుపుకొంటూ ‘ఓహో ఇదంతా స్వప్నలోకంలోనా?’ అన్నా ఆశ్చర్యం ప్రకటిస్తూ.

‘మీ రీలోకంలో ఎప్పుడూ వుండరుగా మరి’ అని అంటించింది దేవి.

# వారణాసి - దక్షిణకాశి

సత్యవోలు శ్రీరామమూర్తిగారు

భారతదేశమునగల పుణ్యక్షేత్రముల కెల్ల నాయకమణియై వెలయు కాశీక్షేత్ర ముత్తర హిందూస్థానమున గంగాతీరమున గలదు. ఈనగరము రోమునగరమునకంటెను పురాతనమైనది. వేద వ్యాసుడు రచించిన



కాశిలో గంగాతీరమున నొక ఘట్టము.

స్కాందపురాణములో గాశీఖండమును గూర్చి వర్ణింపబడియున్నది. అట్టి మహా పురాణాంతర్గతమైన వర్ణనమునకు నిలయమైన కాశికా నగరమునకు వారణాసియనిగూడ పేరుగలదు. ఈనగరమునకు దక్షిణోత్తర భాగములందు వరుణ, అసి అనునదులు ప్రవహించుటచే నారెండు నదులకుమధ్య నున్న యీపట్టణమునకు వారణాసియను పేరు గలిగినదని పురాణప్రసిద్ధమైయున్నది. మహమ్మదీయులకు మక్కానగర మెట్టిదో హిందువులకు కాశికానగర మట్టిపుణ్య క్షేత్రము. "It is the Oxford and Mecca of Hinduism."

కాశీపట్టణము గంగోత్తరభాగమున బడి మైళ్లపొడవున గంగనంటియున్నది. గంగా

తీరమున నలుబదియేడు ఘట్టములున్నవి. ప్రతి ఘట్టమునకు శిలాసోపానములు గంగ లోనికి బోవుటకు గలవు. ఈ ఘట్టముల నంటి సౌధరాజము లనేకములు గలవు. యాత్రార్థమేతెంచిన వారనేకు లీ సౌధములలో వసియించుచుందురు. కాశీపట్టణమున పదునైదువందల యాలయములు గలవు. ఇచట ముఖ్యముగు దేవళమున స్వయంభు వగు విశ్వనాథలింగముగలదు. ఈ విశ్వనాథు నాశ్రయించి తొల్లి హరిశ్చంద్రుడు, గౌతమబుద్ధుడు, శంకరాచార్యుడు, తులసీదాసు, రామదాసుమున్నగు మహాత్ము లనేకులు, మునులు, మహాపండితులు దమశిష్యగణములతో గాశీపురమున వేదశాస్త్రములను, భక్తివైరాగ్యాది యాత్మవిద్యలను, కావ్యాలంకారాది సాహిత్యవిద్యలను నభివృద్ధిచేయుచు వసియించిరి. ఈపట్టణపు జనసంఖ్య రెండులక్షల యిరువదివేలు. అందు బ్రాహ్మణుల సంఖ్య యిరువదివేలు. వేలకొలది జను లీపట్టణము ననుదినము జేరినను సకలజనులకు నన్నమిడు సత్రములనేకములు గలవు. అందు ముఖ్యముగ నన్నపూర్ణ సత్రమున భుజించినవారికి ముక్తిగలుగునని నమ్మి యాత్రార్థమీపురము జేరిన మహారాజులు, జమీందారులు, వారు వీ రననేల సకలజనులు నొక్కపూటయైనను భుజింపక మానరు.

ఔరంగజేబు చక్రవర్తి తన పరిపాలనా సమయమున హిందూమతమును ద్వేషించి కాశీకా విశ్వేశ్వరాలయము బగులగొట్టించి దానిప్రక్కనే యాదేవాలయ పరికరములతో పెద్దమసీదు గట్టించెను. కాశీనగరమున మహమ్మదీయుల జనసంఖ్య యేబదివేలు. అచట సుమారు నాలుగువందల మసీదులు గలవు. వాటిలో హిందూదేవాలయముల బగులగొట్టించి ఔరంగజేబు కట్టించిన రెండుమసీదులు ముఖ్యమైనవి.

విశ్వనాథ దేవాలయము మిక్కిలి యున్నతమైనది గాకపోయినను బంగారు రేకులతో సమర్చబడి మిక్కిలి సుందరముగా నుండెడిదని చరిత్రకారులు చాటుచున్నారు. అట్లుశిథిలమైన విశ్వేశ్వరాలయమును మరల రాణీభవానీదేవియు, అహల్యాబాయియు గట్టించి లక్షరూప్యములు కర్చుపరచి సత్రమునుగూడ కట్టించిరి. నూతనముగ కట్టబడిన దేవాలయమునే నేడు మనము గాంచుచున్నాము. భవానీదేవి కాశికాపురమున వేదపాఠశాలలు సంస్కృతపాఠశాలలు నెలకొలిపి వాని పోషణకు, విద్యార్థుల పోషణకు లక్షలకొలది ధనము విరాళముగ నొసంగెను. మఱియు విద్యార్థులు నివసించుటకీమె గంగాతీరమున భవనములనేకములు కట్టించెను. ఆభవనములు, పాఠశాలలు నేటికిని వృద్ధి గాంచుచున్నవి.

గంగానదిమీద పెద్దవంతెన గలదు. గంగలో ననుదినము వేనవేలు జనులెడ తెఱపిలేకుండ నుదయాస్తమానములు స్నానముచేయుచుందురు. గంగలో నెల్లపుడును నీటియేనుగులు మునుగుచు తేలుచు వినోదముగ నుండును. యాత్రార్థమువచ్చువారు మొత్తముమీద దినమునకు నరువదివేల

వరకు నుందురని రైల్వేయధికారు లంచనా వేసిరి. ఏ పట్టణమునకైన వృద్ధిక్షయము లున్నవిగాని యాపట్టణమునకు వృద్ధియేగాని క్షయ మెన్నటికిని గలుగదని చెప్పవచ్చును. గంగాతీరమున నీపట్టణము మిక్కిలి యలంకారమై యుగాంతమువరకు నిట్లుసకలవిద్యల తోడను సకల మతములతోడను రాజిల్లుచు సకలజనులకు గన్నులపండువు సేయుచుండును. కాశీక్షేత్రమున పవిత్రమైన యానిర్మల గంగా వారిపూరముల జలకమాడ సంకల్పింపని నాస్తికుడుగూడ లోకమున నుండడు. అట్టిమహామహిమనుచాటు కాశీఖండమును శ్రీనాధమహాకవి తెలిగించి తనకవితాకన్య నలంకరించినాడు.

## దక్షిణకాశి

బొంబాయినుండి బెంగుళూరునకు రైలు మీదపోవు ప్రతిప్రయాణీకునకును బెంగుళూరున కిరువదిమైళ్లదూరమున కుడిభాగమున నొకపెద్ద పర్వతము కానబడును. ఈ పర్వతమునకే శివగంగయనిపేరు. ఈకొండ సుమారు 5000 అడుగులయెత్తు గలిగి చాల విస్తీర్ణమువరకు వ్యాపించి రైలులోబోవు ప్రయాణీకులకు కన్నులపండువుగానుండును. ఈకొండ తూర్పుభాగమున ఎద్దు ఆకారముగను, పడమట విఘ్నేశ్వరాకారముగను, ఉత్తరమున సర్పాకారముగను, దక్షిణమున లింగాకారముగను గానబడును. మైసూరు రాజ్యమున శివభక్తులు పెక్కుమంది దీనినే దక్షిణకాశీ యని యాత్రార్థముబోయి, యందుగల దేవాలయములను దర్శించుచుందురు.

శివగంగకు దగ్గరనున్న రైల్వేస్టేషను నిడవంద. శివగంగకుపోవు యాత్రికుడు నిడవందస్టేషనులో దిగవలెను. అచటనుండి 5 మైళ్లు నేరుగా బాటనుబోయిన కొండప్రక్కనేయున్న గ్రామముచేరును. ఈ గ్రామమునకు బయట పెద్ద సింహద్వారమును, దానిపైన నొకగాలిగోపురమును గలదు. మెట్లద్వారా కొండనెక్కు యాత్రికులీ సింహద్వారముగుండా పోవలెను. పెక్కు దేవాలయము లీగ్రామముననే గలవు.

శివగంగ కుత్తరభాగమున ప్రధానమగు దేవళములు గలవు. వాటిలో ముఖ్యమగు గంగాధరేశ్వరాలయము, హొన్నాదేవమ్మ గుడి కెంపేగౌడయనునాయకునిచే కట్టబడినవనిచెప్పుదురు. ఇచటనున్న దేవళములన్నియు కొండదొలిచి కట్టబడినవి. అందువలననే యొక్కొక దేవాలయ మొక్కొకకొండ గుహవలె నుండును. ఈ దృశ్యము చాల నద్భుతముగా నుండుటయేగాక యచటకు పోయిన యాత్రికులలో ప్రాచీన శిల్పకళా నైపుణ్యమును కొనియాడనివారుండరు. కొండపై భాగమునకు పోవుటకు పొడవునను మెట్లవలె రాళ్లపై చెక్కబడినవి.

అచటి దేవస్థానముల మహంతి గ్రామమునకు కొంతదూరమున నొక బంగాళాలో నుండును. ఈ కొండమీద నెనిమిది నీటి బుగ్గలుగలవు. వీటికే తీర్థములందురు. వాటిలో నొకదానికి పాతాళగంగయని పేరుగలదు. ఇదెంతలోతునుండి వచ్చునది తెలిసికొనుటకు సాధ్యముగాకపోయెనట. ఈ



శివగంగ (దక్షిణ కాశి)

By Courtesy of "The Hindu."

తీర్థములు చాల మహత్తరమైన వందురు. శీతకాలమునకంటె వేసవికాలముననే ఈ బుగ్గలనుండి గంగ విశేషముగ పొరలి వచ్చును. అచట ముఖ్యమగు రెండు రాతి స్తంభములుగలవు. మకరసంక్రాంతిదినమున మాత్రమే యీ స్తంభముల అడుగునుండి బిందెడుతీర్థము పైకివచ్చునట. ఈతీర్థము చాలపవిత్రమైనదనినొకదానిలోపట్టి సగము మైసూరు మహారాజాగారికిని తక్కినసగము దేవస్థానమునకును నుపయోగించెదరు.

కొండ తూర్పుభాగమునకుబోవు బాట సరిగాలేనందున యాత్రికు లెవరునుబోరు. మిగిలిన భాగములందు పర్వతమంతయు గుహాలతోను వన్యమృగములతోను నిండి భయంకరముగా నుండును.

కొండపై కెక్కుట సులభముకాదు. మధ్యమధ్య కొంత ప్రదేశమున మెట్లు లేక యేటవాలుగా నుండుటచే నట్టిచోట్ల యెక్కుటకన్న దిగుటకష్టము. త్రోవపొడవునను పెద్దనంది విగ్రహములు గలవు. ఈ విగ్రహములు చాల అందముగానుండును. కొండపైకి మూడువందలడుగులు పోయి క్రిందికి చూచినయెడల క్రిందనున్న గ్రామమున కుడిభాగముననున్న చెఱువు, గోపురములు చాల మనోహరముగా కనబడును. ఈ భాగమునుండి పైకిపోవుటకు సులువుగా యినుపకట్టడము గలదు. పూర్వము మైసూరుమహారాజాగారీ కొండను దర్శించునపు డీకట్టడము నేర్పాటు చేయబడెను. కొండ పైభాగమునుండి చూచినచో చుట్టును కొన్నిమైళ్ల దూరమువరకును ప్రకృతి సౌందర్యము గానబడును.

శివగంగనుండి కాశీ నెన్ని యోజనములదూరమునగలదో కొండ క్రిందిభాగమునుండి పైకిపోవుటకన్ని మెట్లు గలవందురు. వేలకొలది యాత్రికులీక్షేత్రమును ఉత్తరకాశీతో సమానముగభావించి దర్శించుచుందురు.

---

ఒకడు:—ఎవరికి ఇంత పెద్దఉత్తరము వ్రాస్తున్నావు?

ఇంకొకడు:—మా బామ్మకు చెముడు. అందుచేత ఇంత పెద్దఉత్తరము వ్రాయవలసివచ్చింది.

—o—

మీటింగులలో మాట్లాడటము అలవాటులేని ఒకడు కంగారుపడి తర్వాత ఏమిచెప్పాలో తెలియక ప్రక్కనున్నవానితో "త్వరగా! తర్వాత మాట అందియ్యి! ఊఁ"

ప్రక్కనున్నవాడు!—ఏమాట అందివ్వను? ఫలానామాట అని చెప్పు!

ఉపన్యాసకుడు:—తెలిసేవుంటే నిన్నడగడమెందుకూ?

## కాశ్మీర మజిలీలు

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు

### బంగారుగుడి

౧

జలియన్‌వాలా భాగ్‌నకు బంగారుగుడి ఎంతో దూరమునలేదు. భాగ్‌నుండి గుడివైపునకుపోవు సందు కలదు. సందు సన్నమైనది. అయిననేమి? దాని కిరుప్రక్కల వర్తకము విస్తారముగా జరుగుచునేయున్నది. అంగడిపైఅంగడికలదు. బండ్లరద్దీకూడ అధికమే! పథికులసంఖ్య అసామాన్యమైనది. కావునసందు చులకనగ నడచుట సాధ్యముకాదు. ఈస్థితిపథమందలి విపణిశ్రేణి ఎంతపరిశుభ్రముగానుండునో అందుండు వారి వాలకములెట్లుండునో పాఠకులే యూహించుకొనగలరు.

బంగారుగుడి నీవఱలో రెండుపర్యాయములు చూచియుంటిని * మరల విలోకించి, ఆనందింపవలెనను మక్కువ మిక్కిలి యెక్కువయ్యె. లాహోరుకాంగ్రెస్‌ముగిసినంతనే నన్నచటికి దోకొనిపోయెను. నాకూడ పొట్టిపిచికిమాత్రమున్నాడు. సాయంసమయము. స్వర్ణమందిరమును చూడవలసిన సమయమిదియేకదా!

సందుకొనయందు నూఱుడిగ్రీల కోణమున నొక బాటకలదు. ఈ తోవకూడ జనసంకులమైయున్నది. భాగ్‌నుండి గుడికిపోవువారు ఆచోటున దిగెదరు కనుక టాంగాలందు గుంపుగానుండుట తఱచుగ చూచుచుందుము.

ఈ తావునకు దిగువ నొక పెద్దచెరువుకలదు. స్వర్ణమందిరము దీనినడుమనున్నది. సరోవరముచుట్టు నెత్తైనగోడలుకలవు. వానివెనుకగల ఉన్నతసౌధములు మందిరమునకు కనులప్పగించి నిశ్చలులై నిలచిన చూపఱు లట్లు తోచుచున్నవి. సరస్సునకు నలుదెట్టులందు చక్కని మండపములుకలవు.

పథపార్శ్వమందలి మండపమునకు సమీపమున నొక సిక్కుముసలివాడు పద్మాసనము వేసికొని కూర్చుండును. డెబ్బదేండ్లు నిండినవాడయ్యు, ఈతడుత్సాహపూరితుడైయుండును. బలిష్టకాయుడు. ఉన్నతమైన ఉష్ణీషమీతని తలపై తనరుచుండును. చెంపలనుండి పయనముసాగించి శిరమునుచేరు పెద్ద మీసములతోను, ఒత్తైన వెల్లగడ్డముతోడను, ఈతని వదనము మిగులగంభీరమై మాపట్టును. వీని శరీరఛాయ చక్కనిది. బాలకునివలె నీతడు ముసిముసి నగవులు నవ్వుచుండును. హాస్యరసమొలుక దఱచుగ నెదురైనవారితో ప్రసంగించుట ఈతని యలవాటు. "సింగ్‌జీ! సింగ్‌జీ!" అని సంతోషముతో ప్రజ లీతని బలుకరింతురు. గుడిలోనికి పోదలచువారు కాలిజోళ్లను ముసలి కూర్చున్నచోటున విడిచిపోవుచుందురు. ఈస్థానము మిగుల విశాలమైనది. కొన్ని కొన్ని గజములదూరమున నాలుగుకుళాయిలున్నవి.

* 1935లో తిరిగి భారతపర్యటనము సలిపినపుడు అమృతసరమున కొన్నిదినములుంటిని. కావున ప్రస్తుత కథాంశము జరిగినపిదపగూడ జలియన్‌వాలా భాగ్‌ను, స్వర్ణమందిరమును జూచితిని. భాగ్‌తొంటి సొంపును గోల్పోయినది. ఎఱ్ఱనైయుండిన అందలితెరువులు వెలవెల బారియున్నవి. వాటి పచ్చనిమొక్కలు నేడు కృశించిపోయినవి. "జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసి" అనుశ్లోకము భాగ్‌కోణమందలి నూతిగోడపై వెలయుచున్నది. ఈనూతినిగుఱించిన ఉదంతమును చుట్టుప్రక్కలనున్న గోడలమీది రంధ్రములనుగుఱించిన వృత్తాంతమును చదువరుల కీవఱలో తెలిపియుంటిని.

ఒకగద్దెపై సింగ్ జీ ఆసీనుడై, ఉన్నతమైన బొజ్జపై చేతులునిలుపుకొనియుండును. అప్పుడప్పుడు మీసము దువ్వుకొనుటకును, సాంద్రమైన గడ్డమును సవరించుకొనుటకును, అందలి మృగములను వెలుపలికీడ్చుటకును, తీవిగ పాగాను నిలుపుటకును చేతులెత్తి వెంటనే బొజ్జపై తిర్చివేయును. గంటలకొలది కూర్చున్నను, పద్మాసనము నాతడు విడనీయడు. సింగుదృష్టి పోవు వంతవఱకు ఆవిశాలాంగణమున సెన్నోకోళ్లు వరుస వరుసలుగ నమర్చబడియుండును. యాత్రికుడు కనులబడగనే వృద్ధుడు "నమస్తే బాబుసాబ్! ఆయియే! జూతా ఛోడ్ దీజియే! కల్ కా పాస్ హాత్ పాఁధో కర్, మందిరమే జాయియే!" ("అయ్యా! నమస్కారము దయచేయండి. జోడువదలండి. కుళాయి కడ కాళ్ళేతులు కడుగుకొని ఆలయములోని కరుగుడు") అని సాదరముగ స్మితముఖుడై పలుకుచుండును. నవ్వినపు డాతని ముఖమున పండువెన్నెల కాయుచుండెనని తోచును.

కడుపులో కల నరుకెట్టిదో, మనసులోనున్న భావరాజియెట్టిదో ఎఱుగవలెననిన, ఏమరియున్నపు డొకని నవ్వును చూడవలెను. విషపునవ్వు, వెఱ్ఱినవ్వు, వట్టి నవ్వు, నాటకపునవ్వు, బూటకపునవ్వు, అవసరమైన నవ్వు, అక్కరకుమాలినవ్వు, ఆలోచనగలనవ్వు, అసలు సంగతినడంచి ప్రసంగమును దాటించునవ్వు, ఏతప్పవలె లౌకికమర్యాదకై ఏర్పడినవ్వు. ఎదుటివానిని చులకనచేయునవ్వు, గడుసునవ్వు, స్వాగతమునసలుపునవ్వు, వెక్కిరించునవ్వు, ఏడ్వలేక నవ్వినవ్వు – రకరకముల నవ్వులుకలవు. ఇవి నిక్కంపుప్రకృతిని వ్యక్తీకరించునవికావు. మెదడు పనిచేయునపుడు, ఆదమఱచియున్నపుడు వచ్చిననవ్వే నిక్కంపువర్తనమును, అంతరంగమందలి సత్యస్థితిని ప్రకాశముగావించును.

సింగుహృదయము శుభ్రమైనదని – అతి దమాయిపడని వానినవ్వే చెప్పక చెప్పుచున్నది. ముఖమును వీక్షించినంతనే అతడు మంచితాత యనుభావము మనసున మెదలుచును. కావున పోయి, వానితో కొంతసేపు ప్రసంగింపవలెనను మక్కువ నిక్కముగ కలుగును.

జోళ్లనందువిడచి, మందిరమునకరిగి, మగిడిన యనంతరము యాత్రికులు తమకు తోచినపైకమును సింగునకిత్తురు. అణాకుతక్కువగ నెవ్వరునియ్యరు. తాతకు దినమునకు పదిరూకలమొత్తమునకు తక్కువగిట్టదు.

సింగు విడియుచోటనుండి దిగువకు మెట్లున్నవి. కాసారమునకు నలువలంకులందు నలరారు చలువరాతిగట్టులతీరు సోపానములు మండపములవాపున దృగ్గోచరమగును. పడమరనుండి యడ్డముగ మందిరము దిక్కుగపోవు సున్నితపథముకలదు. ఇదియు పాలరాళ్లతో నిర్మింపబడినదే! దీని కిరుపార్శ్వములందు చిన్నిచిన్ని స్తంభములుకలవు. నగిషీగల బంగారురేకు వీని చుట్టు దళతళ మెఱయుచుండును.

సింగు నాకు పూర్వపరిచితుడే! కొంతదూరమందుండగనే నన్నాతడానవాలుపట్టి, బొజ్జకొననుండి కరద్వయమునెత్తి మహోల్లాసముతో నన్నాహ్వానించినాడు. వృద్ధునిగాంచినంతనె నాయానందమునకు మేరలేకపోయెను. వందనమందుకొని చరచరపోయి వానిపొంత గూర్చుంటిని. పొట్టిపిచికె నాతడీవఱలో చూచియుండలేదు. "ఈ యాజానుబాహువెవ్వరు? శిష్యుడా యేమి?" అని యాతడు ప్రశ్నించినాడు. వృద్ధునిపై కోఱచూపులు నిగిడించుచు నోరువిప్పక బుడంకాయిగాడు గొంతుకలో వికృతస్వరము గావించినాడు. తాతచేసిన పరిహాస మాతనియందించుక కినుకను బుట్టించెను. "వీడు మావాడే! చాల మంచివాడు! భక్తుడు!" అని ప్రత్యుత్తర మొసగితిని. తోడనే పొట్టిపిచికె మొగమున ప్రసన్నాలోకము తళ్కొత్తెను. ఒక మంచిమాటను వినినంతనె వీనిమనసున సంతసముప్పొంగును. రెండు మధుర వాక్కులు చెవిబడినంతనె ఈతడు తన్మయనృత్యము

సలుపును. మరల నొక పుల్లవిఱుపుడుముక్క వినబడినచో నితడు చల్లువలేచును. విశేషముగ నుడికించిన విలపించును. ఒక్కొకపుడు కొట్టవచ్చును. తోచనపుడు వీని ప్రసన్నప్రచండ ప్రదర్శనములను విలోకించి యానందించుట నాయలవాటు. ఈతనిచేతులందు నా ప్యూట్ కేసున్నది. సింగు జబర్దస్తీగా దీని నూడపెఱికినాడు. నిప్పుత్రొక్కినకోతివలె లేచి బుడంకాయగాడు ముసలివానిబొజ్జపై బోర్లపడి, తన వాడిపండ్లను ప్రయోగింపదలపడినాడు! "ఛీ! లెమ్మ"ని యఱచితిని. తోడనే లేచి, ఆతడు నా పొంత గూర్చున్నాడు. "బడావస్తాద్ హై" అని పకపకనవ్వుచుపలికి 'ఖావ్ పేట్ భర్! ఠండారహో'! ("కడుపునిండా తిను, శాంతిల్లుము") అని, సమీపమందున్న మిఠాయిని సింగు వానిచేతుల బెట్టినాడు. ముసిముసినవ్వులునవ్వుచు పొట్టిపిచికి దానిని నిముసములో మ్రింగినాడు. "నాకేదిరా ?" యంటిని. "అవుర్ దేవ్ దాదాజీ !" ('ఇంకా తెమ్ము తాతా!') అని యాతడు సింగును పీడింపదొడగినాడు.

ఇక నాలస్యమొనరింపక, జోళ్లనందుపీడి కాళ్లేతుల ప్రక్షాళన మొనరించుకొని, పొట్టిపిచికితో దిగువకు దిగితిని. ప్యూట్ కేసు వెంటనుండరాదని గ్రహించి దాదాజీకడ బుడంకాయ దాని నుండనిచ్చినాడు. "ఇక నల్లరిచేయకుజూమీ!" అని వానిని హెచ్చరించి, అల్లనల్లననడచి మందిరసముఖమందలి ప్రస్తర మార్గమున ప్రవేశించి నిముసమునిలిచి రెప్పలెత్తితిని. నాలుగజములదూరముననున్న మందిరమునుండి పెడలు మధురమంజుల నిస్వనము చెవులబడిన అనిముసమందే, కోటికోటితళ్కులచే కాంతిలుచు, సమ్ముఖమందలి యత్యద్భుతదృశ్యము కన్నులకు మిఱుమిట్లుగొలిపెను. మనుష్యశరీరమున కట్టుబడియుండుటనుమఱచి నా యాత్మ కమలాకరమునుచూచిన కలహంసకరణి, ఇష్టదేవతనుగాంచిన పరమహంసపగిది తన్మయనృత్యము సలిపెను.

నిముసమునకొక యడుగువేయుచు ముందులకు నడువదొడగితిని. బుడంకాయ వెన్కనున్నాడు. పాపము కిక్కురుమనలేదు. బంగారు కాంతిపూరము పోయినకొలది యధికమై తరంగాయిత రత్నాకరమువలె నుబుకుచు నన్ను ముంచివేయసాగినది.

ఆలయద్వారమును సమీపించితిని. ఆహా! అంతయు స్వర్ణమయమే! వెలుపల నేవంకజూచినను బంగారే! లోపల నేమూలజూచినను రంగారు బంగారమే! మయసభను చేసిన మహాశిల్పియే ఈయాలయమును నిర్మించియుండును! ఇందలికౌశలము, ఇందలి సౌందర్యము, ఇందలి భావగాంభీర్యము, ఇందలి కళామహత్త్వము అనిర్వచనీయములు. స్వర్ణమందిరవర్ణనము స్వర్ణాక్షరములంతే, క్షరముకాని దివ్యకావ్యాక్షరములందే కానవగును!

ఆమందిరమునకు నలుకెలంకులందు వసారా యున్నది. అదియు నపరంజి కాలవాలమైనదే! మిన్నకీను బంగారుకమ్ములు వసారాకును సరస్సునకును నడుమ నొప్పారుచున్నవి. నాలుగు వలకులందలి పార్శ్వపథములగుండా నడచి ప్రదక్షిణ మొనరింపవచ్చును. ఒకమాఱు లోనికిజూచి ప్రదక్షిణము నారంభించితిని. సరోవరము స్వర్ణసలిల సంభరితమైనట్లగపడెను! అనంతకాంతి పూరితహ్రదము దివినుండి అందవతరించెనని గ్రహించితిని.

ఈ మహాద్భుతదృశ్యమెట్టిదో, అందు నిలుచుతఱి మనమున నెట్టిభావము ఉదయించునో ఎఱుగవలెనని మానసనేత్రముల మ్రోల దానినినిలుపుకొని, చూడ్కుల జలింపనీయక, చిత్తము పర్విడనీయక, ఆత్మవిస్మృతులై చదువరులు దానినే పరికించుచు తన్మయులై యుండవలెను.

సంధ్యాసమయముకదా! దివిడోచునాతడు నగుమోమునగాంతిలు విశ్వమోహన సౌందర్యమూర్తి ప్రభాకరుడు! అవనిపై కురియునవి అవిరళాపరంజి

కిరణవృష్టి! ఏ దివ్యచిత్రకారుడో వియత్తలమున చిత్రించిపోయిన సప్తరాగ సందీప్తదృశ్యము బంగారు వెలుగు వానగుండా హిమాలయముపై వింతవింత తళుక్కుల జల్లుచుండెను. దివ్యచ్ఛటలందు తానమాడు సువర్ణమందిరము, కనకవసనధారిణియైన అచ్చరచాన యొర్తు స్వయంప్రభయై నాకభూమిలోని కొలనున గ్రుంకులిడ గమకించునట్లొకపరి తోచెను. దీర్ఘవ్రత మాచరించి, వ్రతముపండిన తన నవ్యతేజస్సునంది, కాత్యాయనీ ఘనహృదయమునుండి వడివడిగ జాల్వారు యాశీస్సులకు నుత్తమాంగమునొడ్డి శుభ సాగరమున మున్కవేయునుంకించు సీమంతినీ చూడామణివలె ఇంకొకపు డగపడెను. దుష్టకష్టములనుండి మనసును తరలించి, భావనాశక్తిచే స్వర్ణసామ్రాజ్యమునొండు సృష్టించుకొని, కళావతియై ఆనంద హృదమున మునిగితేల నూహించు కవయిత్రివలె వేఱొకప్పుడు చూపట్టెను. ఈమె యంతరంగమందలి అనంతభావములు మధురాలాపన మొనరించుచు నూత్నులై వెడలుచుండెనని, గానబంధురమందిర హృదయముపొంత నిలిచినపుడు తలచితిని. జగన్మోహిని అంతరిక్షమునుండి యవనిపైనవతరించి సరోవర దర్పణమున నాత్మరూపునువిలోకించి, తన యద్భుత సౌందర్యమునకెంతో యచ్చెరువొంది పట్టరాని యానందమున రాగాలాపన మొనరించుచుండెనని భావించితిని. ఇహజీవనమును వీక్షించి, "ఇస్సీ!" యనువారి దురభిప్రాయమును తునియలుచేసి, ఇచ్ఛాశక్తికలన మానవు డాత్మజీవనమును సౌందర్యసందీప్తమును, గానబంధురమును గావించుకొనగలడని నిరూపించుటకై ఏకళోపాసకుడో ఈ యద్భుతదృశ్యమును సృష్టించి నిభృతమునుండి చూపఱుల హావభావములను గనుచుండెనని యోచించితిని. ఏలనో స్వర్గమందలి కల్యాణవేదిక యమృతసరమున తటాలునరాలి, తటాకమున తనరుచుండెనని తలపోసితిని. ఏ మహాకవి మానసమందో దివ్యమరీచుల జిమ్ము స్వప్నము, యవ్వలబడి రూపుదాల్చి అచటిసరస్సున విడిదిసేర్పఱచు కొనెనని యూహించితిని. "సృష్టియన నిట్టిది, కళయన నిట్టిది, సహజసౌందర్య సంశోభిత భావమన నిట్టిది, సద్గుణమన నిట్టిది, భాస్వదాశయమన నిట్టిది, సాహితీహృదయనిన నిట్టిది, కవి కాంక్షింపవలసిన అరణమిట్టిది" అని జిజ్ఞాసువులకు తెలుప నిశ్చయించి నలువ ఈదృశ్యము నిందు సృష్టించియుండునని యోజించితిని.



# పసిబిడ్డలకు ఫలాహారము

ఎస్. శేషగిరిరావుగారు

"An apple a day......................" అను ఆరోగ్యసూత్రము పెద్దవారలకు పిల్లలకుకూడా.

ఆపిల్సు, పలుపరుసను శుభ్రపరుస్తవి. వీటితో భోజనము ముగించుట, పిల్లలకు వీటిని భోజనానంతరము యిచ్చుట మంచిది.

సంవత్సరము మూడునెలలయిన బిడ్డనికి దినము కొంచెముగ ఆపిల్ తినునట్లు అభ్యాసముచేసి 18 నెలలగునప్పటికి దినమునకు ఒకపండే పూర్తిగా యిచ్చుచు రావలెను.

మంచి పండినపండు చెక్కుతీసి ముక్కలు ముక్కలుగకోసి పిల్లలకిచ్చి నెమ్మదిగ చక్కగ నమలి తినునట్లు చూడవలెను. ఆముక్కలతో పిల్లలను ఒంటరిగ వదులుట ప్రమాదముకావచ్చుగాన గమనించుట అవసరము. నమలక ముక్కలనుమ్రింగిన గొంతు కడ్డము పడి ప్రాణాపాయము కావచ్చును.

పిల్లలకు ఆహారమిచ్చినతర్వాత కొద్దిగా ఇంపగు ద్రాక్ష ఖర్జూరము మొదలగు ఎండినఫలముల నిచ్చుట చాలమంచిది.

పై చెప్పినగుణమే కమలాల (oranges) కు కూడ కలదు. ఇవి భోజనమైనపిదప వాడినయెడల పండ్లను శుభ్రపరుస్తవి.

# టుమ్రీలు

బిడ్డలకు పాలిచ్చి శుభ్రమగుగుడ్డతో పెదవులను తుడువవలెను. లేకున్న పెదవులు నలుపెక్కును.

కరచిత్రాగిన–చనుపాలు చెడవు.

పలుచని చనుబాలవలన శరీరము లావెక్కునే గాని పుష్టి కలుగదు.

◆ ◆ ◆

శిశువులకు ఊదుపులు అవసరము. లేకున్న శరీరముయొక్క మృదుత్వము చెడును. వ్యాధులుకూడ రాగలవు.

◆ ◆ ◆

నరముల బలహీనతవలన గోళ్లు కొరుకుటవచ్చును. ఔషధములనువాడి ఆబలహీనతను పోగొట్టవలెను. ఒకవేళ గోళ్లుకొరుకుటే అలవాటుఅయిన తల్లులు ప్రయత్నించి యీదురభ్యాసమును మాన్పుట అవసరము.

◆ ◆ ◆

వ్రేళ్లు చీకుటవలన దవడలు వికారమవును. ముఖము బొందికమారును.

◆ ◆ ◆

ఎదిగెడిపిల్లలకు మెత్తటి పరుపులు కూడదు.

◆ ◆ ◆

చిన్నతనమునను, మరల మరలను టీకాలు వేయించుట అజీర్ణమునకు కారణమగునని కొందరి అభిప్రాయము.

పెద్దవారి చేతులకాక పిల్లలకు మంచిదికాదు. అందువలన పిల్లలను తరచుఎత్తుకొనుట కూడదు. చర్మవ్యాధులు మొదలగు అంటుజాడ్యములు కలవారు అసలు తాకుటయే మానవలెను.

◆ ◆ ◆

చిక్కిపోవుబిడ్డలకు ఆలివ్‌నూనె (olive oil) ను వయసునుబట్టి 1–2 స్పూనులు లోనికివాడుట, ఒంటికిపూసి మెల్లగా రుద్దుట మంచిది.

◆ ◆ ◆

బిడ్డలు పుట్టగనే ఏడుస్తారు.

ఆరువారములలో రకరకములగు శబ్దములను చేస్తారు.

కులుకుతూ నవ్వుతారు 3-4 నెలలో.

4 నెలలయితే అ (ah)–గ (ga)–డ (da) అని అంటారు.

8 నెల లగునప్పటికి అంతకుముందు నేర్చినవే పలుమారు పలుకుతూ వుంటారు.

10వ నెలలో పేర్లుచెప్పిన వస్తువులను చూపగలరు.

సంవత్సరము 6 నెలలు అయినయెడల ఒక్కొక్కమాట, పైబడిన రెండురెండు మాటలు పలకడానికి ప్రయత్నిస్తారు.

# గృహలక్ష్మి కంఠాభరణము

గృహలక్ష్మియందు ప్రకటింపబడిన మనోహర త్రివర్ణ చిత్ర పటములందు 46 పటములను ప్రత్యేకముగ నేర్పరచి యొక్కొక్క చిత్తరవునుగూర్చి వివిధవిషయములలో వాడుక భాషయందు హృదయరంజకముగ వ్రాయబడినది. ఇందలి రసవంతమగు రచన, మనోజ్ఞమగు చిత్తరువులు, ఎల్లర నాకర్షించు విశేషములు వీనినిగూర్చి యితరులేమందురో గమనింపుడు.

"వివిధవిషయాలకు సంబంధించి వివిధనీతులను బోధించే పెక్కుచిత్రాలను సేకరించి, క్రమం ఏర్పరచి చక్కగా ముద్రించారు. వ్యాఖ్యలుగూడా నాతిదీర్ఘంగా, నాతిలఘువుగా—యథోచితంగా వ్రాశారు. రచనావిధానంలో అవలంబించిన పద్ధతిగూడా అహ్లాదకరమై—బాలికలకు—సుకుమారబుద్ధులకు—చదవడానికి చవులూరుతూ ఆకర్షవంతంగా ఉంది. లోకోక్తులు, ఉపమానాలు, ఉదాహరణాలు—అన్నీ యథాస్థానంలో చక్కగా అమరివున్నవి.

* * *

స్త్రీజనానికి ప్రధానంగా నాలుగుదశలలోనూ కావలసిన ఉపదేశం ఈ గ్రంథంలో వున్నదని చెప్పవచ్చు. ఒక్కొక్క బొమ్మను ఆధారం చేసుకుని వ్యాఖ్యాత బాలికలకు ఎంతో ఉపదేశం—విలువగలవిషయం—బోధించారనవచ్చు. దేశంలో ప్రస్తుతం క్లిష్టంగా వున్న ఎన్నో సమస్యలను చిన్న పిల్లలకు సుబోధమయ్యేటట్లు, తేటతెనుగులో అంటిపండొలిచి చేతిలో పెట్టినట్లు స్పష్టంగా వివరించారు. నిజంగా తెలుగుకన్నెలకు ఈగ్రంథం మిక్కిలి విలువగల నగ. — — ప్రతిభ"

వెల రు. 2 0 0

## గృహలక్ష్మి కార్యాలయము

ఎగ్మూరు    మదరాసు

# అల్లుడష్టమశని

శ్రీమతి ఆచంట సత్యవతమ్మగారు

కన్నకొడుకుపోయి విచారముతోనున్న కూతురు నొక్కసారి పుట్టినింటికి పంపుమని తల్లి రెండుసారులువెళ్లి అల్లుని బ్రతిమాలినది. మొదటిసారి సదుత్తరమేలేదు. మౌనమే. రెట్టించి యడగినచో ఆగ్రహరూపము. ఇదిగని కూతురు మంచిమాటలాడి తల్లినిపంపివేసెను.

కడుపుతీపిచే అభిమానము చంపుకొని పతిలేనిసతియొక్క అలుసుతనమునకు విచారించుచు రెండవసారి అల్లుని బ్రతిమాల వెళ్లినది. ఈసారి యిప్పట్లో పంపుటకు వీలులేదు. నావంతు ఆస్త్రివ్రాసియిచ్చి, నీ పెద్దయల్లునికిపెట్టిన ఖర్చులన్నీ లెక్కచూచి పంపిన మీకుమాత్రేను పంపెదననెను. మగని కోపముచూచి కూతురు తల్లిని యూరడించి నాకొరకు విచారించవలదు. నేను సౌఖ్యముగా నుండుటే నీకు కావలసినదిగాన ఆయన కాగ్రహమురాకుండ వెడలిపొమ్మని తల్లిని బ్రతిమాలి పంపివైచెను.

దీనితో తల్లి నిరాశచేసుకొనెను. కాని మనసులో పిల్లకై మరుగుచునేయుండెను. ఇంతలో శ్రావణమాసమువచ్చెను. మంగళవారం నోముకైనా పంపుమని కార్డు వ్రాయించినది తల్లి. అష్టమశనిలో యేశుభగ్రహమువచ్చెనో కాని సరిగా మంగళవారం నాటికి పంపుచున్నానని జబాబువచ్చెను.

దీనితో తల్లి ఆకాశమంటి సంతసించెను. సోమవారంనాటికి ఇంటికి వెల్లలు, గడపలకు పసుపు కుంకుమలు, గుమ్మమునకు తోరణము, అన్ని సిద్ధపరచియుంచెను. రాత్రి శెనగలు నానబోసినది. తెల్లవారెను కాలకృత్యములు దీర్చికొని స్నానమాచరించి, పూజాసంభారములు సిద్ధపరచి, నివేదనకై పులగమువండి, చిన్నపిల్లచే పుష్పములు తెప్పించి, కూతురురాకకై నిరీక్షించుచుండెను. పండ్రెండుగంటలుకొట్టెను. జాడలేదు-ఒంటిగంట-రెండు పడవమీదవచ్చుననుటచే గోదావరితీరమున వేచియుంటతో, ఆతల్లి అలవికాని శ్రమపడెను.

ఇంతలో ఒకపడవ రేవుచేరెను. అపరాహ్ణముతిరుగుటచే ఆకలితో నకనకలాడు కడుపు బిగబట్టి అలసియున్నముఖముతో పదునెన్మిది వత్సరములయువతి దిగి తల్లి నాలింగనము చేసుకొని సంతసించెను. ఒకబండిచేసి కూతురునింటికి తీసుకొనివచ్చి వేగిరము తలంటి పూజచేయించెను. పూజానంతరము పేరంటములై ముత్తైదువుల పిలిపించెను. వాయనములిప్పించి నోము పూర్తి చేయించెను.

రాత్రి పండ్రెండుగంటలవరకు తల్లికూతుండ్రు, అక్కచెల్లెండ్రు కష్టసుఖముల చెప్పుకొనిరి. తదుపరి మెల్లిగా మరునాడే ప్రయాణమని కూతురు తల్లితో చెప్పెను. విచారావృతమేఘావరణముచే తల్లి మానసాకాశమందలి సంతోషవీచికలు మాయమై

విచారాంధకారము వ్యాపించెను. శుక్రవార మొక్కదిన ముండుమనియు, పూజ చేయించి మరునాడు పంపుదునని బ్రతిమాలెను. ఉత్తరము వ్రాయిస్తాననెను. టెలిఫోనులో చెప్పించెదననెను. దేనికిని మగని భయమో, భక్తియో కాని కూతురొక్కటే పట్టు. వచ్చేదాకా ఉబలాటము వచ్చింది మొదలు వెళ్లేవరకు ఆరాటము. మధ్య తల్లికి నక్కచావు. శ్రమ డబ్బుచేతిలో లేదు. ఎక్కడనో తెచ్చి, ఒకచీర రెండురవికెలు కొని, రోజంతయు శ్రమపడి చలిమిడీచేసి, మరునాడు పడవప్రయాణము ప్రయాసయని రైలుఖర్చులిచ్చి, పెదతండ్రినికూడ యిచ్చి పంపించెను.

కూతురున్న దొక్కరోజు ఆమెకై పడిన శ్రమ మూడురోజులు. పదిహేనురూపాయలుఖర్చు. అల్లుడేమనునోయని హడలు. కూతురునువిడచుటకు దుఃఖము. చివరకు నిరాశ, డబ్బుఖర్చు. అదియే అష్టమశని చేయు గ్రహస్థితి. ఇట్టిస్థితిని గల్పించు అల్లుడత్తవారి కష్టమశనిగాక శుభగ్రహమగునా?

అల్లుడనేసరికి వంకలాడి నిదానముగా నిలబడునని ఆర్యవచనము. అల్లుళ్ల అవగుణములు చెప్పబూనినచో భారతమంత గ్రంథ మవకమానదు. ఒక్కొక్కరీతిగా అత్తవారి కష్టమశనియే అల్లునిరూపమున ప్రాప్తించుచుండును. వెనుకగొయ్యి ముందు నుయ్యివలె యెటూచెప్పజాలక తల్లి, మగని మధ్యనలిగేది పిల్ల.

## ఈశ్వర

ప్రభుకోటిదౌర్జన్య పరుతాచు పాలిత
  వర్గరక్తముఁగ్రోలి ప్రబలువేళ,
చటుల దారిద్ర్య ఝంఝానిలార్భటి కర్ష
  కాళియుజ్జూతలం దేలువేళ,
భారతావనిదాస్య బంధముల్సడలింప
  హిందువు లట్టి బిగించువేళ,
సామ్రాజ్యదుష్కాంక్ష సమరశతఘ్నికా
  భీకరార్భటి విజృంభించువేళ,
  సర్వమారకయంత్రాళి సంచయంబె
  ఆధునిక రాజనీతియై యలరువేళ,
  మలయవాసంత వీచికావళులతోఁడ
  ఈశ్వరా! నీవు సాక్షాత్కరించినావె.

శ్రీమతి కొండపల్లి సుభద్రాంబగారు

అనిశంబురాజిల్లు నగ్నికీలలదుష్ట
  ప్రభుత దగ్ధమొనర్చి వైతువంచు,
సిగనుండుజాబిల్లిచే నమృతంబు వ
  ర్షించి హాలికుల రక్షింతువంచు,
అసమానరక్ష నీ యభయహస్తంబుచే
  హిందుజనాళి దీవింతువనుచు,
భవ్యమౌ డమరుకార్భటిచే శతఘ్నికా
  ధ్వానముల్మాయింప బూనెదంచు
  చల్లనైన భాగీరథీ జలసమృద్ధి
  యఖిలమారకయంత్రాగ్ని నార్పుదంచు,
  పూజ్యనటరాజమూర్తివై బ్రోవుదంచు
  ఈశ్వరా నీకు స్వాగతం బిచ్చుచుంటి.

# బెంగాలీ మిఠాయి

### మోహన్ భాగ్

(హల్వా)

అన్ని ప్రాంతములవారును హల్వా యని హిందీపదమునే వాడుదురు. దీనినే బెంగాలీ భాషయందు మోహన్ భాగ్ అని యందురు. దీనిని తయారుచేయు పద్ధతి యన్నియెడల నొక్కటిగనేయుండును. దీనికి సర్వసాధారణముగా నుపయోగించునది గోధుమనూక. దీనిని వంగీయులు సుజ్జి యందురు. ఇతర పప్పుదినుసులు, పిండి కొన్ని పండ్లనుగూడ దీని జేయుట కుపయోగింతురు.

### సుజ్జి మోహనభాగ్

(గోధుమనూక హల్వా)

| | | |
|---|---|---|
| గోధుమనూక | 1 | పౌను |
| నేయి | ¾ | ,, |
| పంచదార | ¾ | ,, |

సన్నని మంటపై నేతిని గరగించి, గోధుమనూక నందులోవైచి బాగుగా కలియబెట్టుచు కొంచము పసుపువర్ణము వచ్చువరకు నుండనివ్వవలయును. నేతిలో తడిసి నూక ఒకవిధమగు సువాసన నిచ్చును. దానిలో తరువాత కావలసినంత నీరుబోసి పదినిముషములసేపు ఉడకబెట్టవలయును. అపుడు డది మెత్తగనగును. ఉడుకుచున్నపుడే చక్కెరనువేసి కలుపవలెను. తరువాత ఏలకులు ద్రాక్ష వేయవలెను. ముద్దగనుండి పెనుముకంటు కొనక వచ్చుచున్న సమయమున దించుకొనవలెను.

కొంతమంది గోధుమనూకను నేతిలో వేయుటకు ముందు ఒకటి రెండు కసింద ఆకులను, సోపును వేసి మరగింతురు.

### మంగర్ మోహన్ భాగ్

(పెసరపప్పు హల్వా)

| | | |
|---|---|---|
| పెసరపప్పు | 2 | పౌనులు |
| నేయి | 1¼ | ,, |
| పాలు | 1½ | ,, |
| కోవా | ½ | ,, |
| పంచదార | 1½ | ,, |

బాదము, ద్రాక్ష మొదలగునవి కావలసినంత వేసికొననగును.

పెసరపప్పు 6 మొదలు 8 గంటలు వఱకు నీటిలో నానవేయవలయును. పై పొట్టు పోవువఱకు నీళ్లలో పిసికి కడగవలయును. తరువాత పప్పును రుబ్బి యుంచుకొనవలయును. పైనచెప్పినరీతి కాగిన నేతిలో పది పదునైదు నిముషములసేపు ఉడకనివ్వవలయును. పప్పువాసన ఎంత మాత్రము లేకుండునంతవఱకు ఉడికించుట యందు చాల శ్రద్ధజూపవలసియుండును.

ఇపుడు పాలువేసి కలియబెట్టి పంచదారను వేయవలెను. ఈమూటిని బాగుగా కలిపి యుడకనివ్వవలెను. పాలునకు బదు

లుగా నీటిని పోయవచ్చును గాని హల్వా అంత మృదువుగా రాదు. పూర్తిగా ఉడకక లేదని సందేహము గలిగినపుడు మాత్రము కొంచెము నీటిని చేర్చవచ్చును. తరువాత ఇదివఱకు వ్రాసినరీతి ముందే సిద్ధముచేసి యుంచుకొనియున్న కోవాను కలుపుకొన వలయును. ఏలకులు, ద్రాక్ష మొదలగు నవి యిపుడువేసి ముద్దయగుచున్నచో దింపుకొనవలయును. బాదము మొదలగు నవి పైనవేసి కలియబెట్టక నుంచవగును. రోజాదళములనుకూడ చేర్చిన రమ్యముగ నుండును. దీనినే హిందీలో దాల్‌హల్వా అనుచుందురు.

పెసరపప్పునకు బదులుగా సెనగ మొద లగు రుచికరములగు నితర పప్పుదినుసుల నీరీతిగనే వేయవచ్చును. పప్పును ఉప యోగించుటకు ముందు నానవైచి పై పొట్టు దీయవలెను.

# పిల్లలే అనగలిగితే

పీడిముద్దు ముక్కలుగాను గడ్డం ఎన్నాళ్లయిందో గీచుకొని. అన్యాయంగా చెంపలు ఒరుసుకొనిపోయినై. *

ఈ చొక్కా వెయ్యడం ఆచొక్కా తీయడం. వినుగూ విరామంలేదూ మీకు? *

ఒకతట్టు అక్కర లేదని నోరుమూసుకొంటుంటే బలవంతంగా ఆపాలుపోయడం ఎందుకూ? ఆకలి నాకా వీళ్లకా? *

నన్నుచూసి ఆవెకిలి చేష్టలేమిటి? ఆపిల్లి కూతలెందుకు? మొరగటమెందుకు నన్ను నవ్వించడానికా. నవ్వుతా వీళ్లను చూచి. నవ్వడమోఏడ్వడమో రెండేచేయగలవి. *

కండ్లేవి నాయనా ముక్కేది అని ఇదేది అదేది అని ఒకటే ప్రశ్నలా? నాకు తెలియవూ? వీళ్లేనా బుద్ధిమంతులు? *

ఇష్టముంటే నవ్వటంకాని తెచ్చిపెట్టుకొంటామా. పిన్నిరా– అమ్మమ్మరా–అంటే నవ్వుతానా? *

మొలమీదగుడ్డ కప్పకూడదూ? వీళ్లకేనా సిగ్గులు నాకు లేవూ? ఛీఛీ! వీళ్లనేమనాల్నో తెలీటంలేదు. *

కడకు నిద్రపోతుంటేకూడానా అల్లరి. ఆ అమ్మా యీ అమ్మా చూడటానికిరావడం.

యస్. యస్.

# నా చిన్నతనంలో

శ్రీమతి పి. ఆర్. మణిగారు

మాఅమ్మ బిడ్డల్లోకల్లా చిన్నప్పుడు నేనే బుద్ధిగా వుండేదాన్నని తొందరగా మాటలొచ్చి ముద్దుగా మాట్లాడేదాన్నని, పెద్దవాళ్లు చెప్పుకుంటూవుంటే ఇప్పటికీ గర్వపడుతూవుంటాను. మా నాన్న గారి స్నేహితులు వస్తూవుండేవారట మాయింటికి. వాళ్లు నన్ను దగ్గరకుపిలిచి 'ట్రంకుపెట్టి' అని అనమ్మా అంటే 'ఒంకుపెట్ట'నే దాన్నట. ఒకాయనపేరు గోపిశెట్టి రంగయ్య. మాయింట్లోవాళ్లంతా పేరు వదిలేసి 'గోపిశెట్టి'ని పిలిచేవారట, నాకట్లా పిలవడం సరిగ్గారాక 'గోబిపెట్ట'నే దాన్నట. ఇప్పటికీ మావాళ్లివన్నీ చెప్పుకొని నవ్వుకుంటారు.

అయిదవయేడు రాగానే మాఅమ్మ మాకు చదువు చెప్పడం ప్రారంభించేది. మూడు క్లాసులువరకూ యింట్లోచెప్పి, నాలుగవ క్లాసుకి స్కూలులో చేర్పించేది. మొదల్లోనే స్కూలుకిపంపిస్తే అ,ఆ,లు చెప్పకుండానే అలక, ఆట అని చెప్పడం ప్రారంభిస్తారని మాఅమ్మ కిష్టములేదు. అ,ఆ,లు దగ్గరనుంచి స,హ, ళ, క్ష వరకూ గబగబా పలకమీద వ్రాసే శక్తి కలిగాక మొదలెట్టేది గుణింతాలు. ఇవన్నీ బాగా వచ్చాక పుస్తకము తెరిపించేది. అట్లా చెప్పబట్టే యింతవరకయినా వచ్చామని మాలో మేమనుకుంటూ వుంటా మిప్పుడిప్పుడు.

మాఅమ్మ చదువుచెప్పేటప్పుడుమాత్రము శ్రద్ధగా వినకపోయినా, దిక్కులుచూచినా, మరచిపోయినా బడితపూజచేసి వదిలిపెట్టేది. అందరూ తన్నులు తిన్నవాళ్లేనట చదువుకొనేటప్పుడు నేను తప్ప. నాకు బాగా జ్ఞాపకమున్నంతవరకూ తన్నులు తప్పించుకొనుట నిజమేగాని వొక్కసారిమాత్రము చాలా కోపంతెప్పించా మాఅమ్మకు. ఆకోపం యెందుకు వచ్చిందీ, యెట్లాతగ్గిందీ, యిదంతా కొంచెము తమాషాగావుండే సమాచారమే. అందువల్ల వ్రాయడానికి తలపెట్టా.

అప్పుడు నాకయిదేళ్లు నిండుతూవున్నయి. మామూలుప్రకారము ప్రొద్దున్న తొమ్మిదిగంటలకు పలకాబలపముపుచ్చుకొని హాజరయ్యా వంటింటిదగ్గర వసారాలోకి. మాఅమ్మ నాకు చదువుచెప్పతూవుంది వొకప్రక్క వంటచేసుకుంటూ. మానాన్నకి నేచదువుకొనేవేళే కాఫీ, ఫలహారము పుచ్చుకోడానికి. మాకంతా పెసరట్లంటే చాలాయిష్టము. అందులో మావూరి పుల్లయ్యపోసే పెసరట్లు మరీబాగుంటాయి, అణా యిచ్చి రెండు పెసరట్లు తెప్పించుకొనితినందే మానాన్న కాఫీ త్రాగేవారుకారు. ఆరోజు చాలా బాగున్నాయి పెసరట్లని, అందరికన్నా చిన్నదాన్ని కదూ, అందువల్ల నాకుపెట్టందే తిన బుద్ధిపెయ్యలే మానాన్నకి. నన్ను చిన్నముక్క తినివెళ్లమని పిలిచారు. అప్పుడే నేను 'చ' తప్పు వ్రాసి నాలుగు చీవాట్లుతిని మళ్లీవ్రాస్తున్నా. ఇంతట్లోకి మానాన్న పిలుపు, ఒకవైపు తినాలనివుంది, యింకొకవైపు అసలే కోపంగావుందే యిప్పుడువెళ్తే యేమంటుందోనన్న భయము. ఈరెండుకారణాలతో గడబిడలాడడం కనిపెట్టారు మానాన్న. 'నేవున్నాగాతల్లీ. మీఅమ్మ

ఏమీ అనదు. రానాయనా తినమ'ని అన్నారు. ఆ వెంటనే 'వెళ్లావంటేమాచు యేమి చేస్తానో' అని గిరుక్కున తిరిగి వెళ్లిపోయింది మా అమ్మ వంటింట్లోకి. వీళ్లిద్దరూ బాగానే వున్నారు, కాని నాపని 'కుడితిలో పడ్డ ఎలుకలాగుంది.' 'నేనుండగా మీ అమ్మకి విన్ననడానికి యెన్ని గుండెలున్నాయి తల్లీ, మీ అమ్మని కొట్టాను రామ్మా'ని బ్రతిమాలి తీసుకువెళ్ళారు. మా నాన్నకంత బాగున్న పెసరట్టు నానోటికి విషములాగున్నది యీ భయంచేత. వుక్కిరిబిక్కిరవుతుందని మా నాన్న గోలెడ్తావున్నా వినకుండా రెండుబుగ్గల్లో కూరుకొని చెయ్యికడుక్కోడానికి దొడ్లోకి వెళ్లా. ఇంతట్లోకే వచ్చేసింది మా అమ్మ. ముక్కలయ్యేటట్టు ఆపలక గిరాటేసేసింది బయటికి. అంతటితో పూరుకుందా! ఊహూ: 'ఈరోజు మొదలుకొని నేను నీకు చదువు చెప్పను, అన్నం పెట్టను. నీదారి నీది, నాదారి నాద'ని గర్జించి వెళ్లిపోయింది లోపలికి. నా కాళ్లల్లో నీళ్లు తిరిగిపోతున్నాయి. చెంబక్కడే జారవిడిచేసా. మనిషినా కొయ్యబారిపోయా. ఎందుకు తిన్నానీ పెసరట్టని నామనస్సులో యెవ్వరో గొణుగుతూన్నట్టనిపించింది. మా నాన్నదసలే జాలిమనస్సు. నాస్థితి పరికించారు. గబగబా లోపలికివెళ్లి మా అమ్మని యేదో అన్నారు. నాకు సరిగ్గా వినిపించలే. 'ప్రవేటుపెట్టి నేచెప్పిస్తాతల్లీ నీకు చదువ'ని అప్పుడు బ్రతిమాలినట్టే బ్రతిమాలి తీసుకొచ్చారు లోపలికి. అమ్మ కనబడి మళ్లీ యేమంటుందోన్న భయంచేత వీధరుగుమీదకి చేరుకున్నా. నాకు అన్నం మా అక్కని పెట్టమని చెప్పేసి మా నాన్న ఆఫీసుకు వెళ్లిపోయారు.

9 గంటలల్లా 11 గంటలయింది. సందడివల్ల మా అమ్మ వడ్డిస్తూవున్నట్టు గ్రహించా. "అమ్మా! చెల్లెమ్మకో," అంది పాపం మా అక్క. దానిసంగతెత్తారంటే తగలనిస్తా నసేటప్పటికి గప్‌చిప్ అయిపోయారందరూనూ. ఎండ అరుగెక్కుతూవుంది. అట్లాగే వొదుక్కొని కూర్చున్నా. ఆకలేస్తుంది. పిలువందే పోవడానికి గుండెలేదు.

ఇట్లా తూగుతూ తూలుతూవుండగనే వొంటి గంట కొట్టారు. మా నాన్న ఆఫీసునుంచి వస్తూనే, నా పీదముఖముచూసి తెలుసుకున్నారో యేమో 'ఏం తల్లీ అన్నంతినలే,' అనడిగారు. మా అమ్మని తలుచుకుంటే వచ్చేభయంచేత నీరసముచేత మాట్లాడలేకపోయా. నా వాలకముకని పెట్టి యింట్లోకి తీసుకువెళ్ళారు. అన్నం తిన్నదీ లేనిదీ మా అక్కనడిగారు. లేదన్నట్టు చేత్తో సంజ్ఞచేసింది. నోటితో చెప్పితే విని యేమంటుందోనని తనకీ భయమే. నే వద్దంటూన్నా బలవంతంగా తనతో కూడా పెట్టించారన్నం. భోజనమయిన వెంటనే మా నాన్న ఆఫీసుకి వెళ్లిపోతారు. నాగుండె జారిపోయింది. అయ్యో యీవొక్కపూట సెలవు పెట్టకూడదా లేకుంటే నన్ను కూడా ఆఫీసుకి తీసుకుపోకూడదా, అన్నాలోచనలతో ముగించా తినడం. ఏసంగతీ పైకిచెప్పలేకుండా నా నోరు నొక్కుకుపోయింది. ఇదంతా మా నాన్న కేమి తెలుసు? మామూలుప్రకారము భోజనము చెయ్యగానే వెళ్లిపోయారు. వచ్చేయేడుపు దిగమ్రింగుకుంటూ వొకమూల చాపేసుకొని గోడతో మాట్లాడుకొంటూ నిద్రపోయా.

నాలుగయినట్టుంది. పనిమనిషి యిల్లువూడుస్తూ నన్ను లేపేసింది. కళ్లు నులుముకుంటూ తిన్నగా వీధి గుమ్మం పుచ్చుకొన్నా. ఇంతట్లోకే స్కూలునుంచి వచ్చారు మా అన్నయ్యలు. వాళ్లహడావిడిలో టీ, ఫలహారము నాకుకూడా దొరికింది.

దీపాలుపెట్టగానే మేమంతా వొకదగ్గరకూర్చుని మా అమ్మ దేవునిమీద పాటలు చెప్పుతూవుంటే పాడేవాడుక. ఆరోజూ చాపేసుకొని మా అన్నయ్యలు, అక్క కూర్చున్నారు. నేను మా అక్క వెనకాల కూర్చున్నా. పాటలుపాడడ మయిపోగానే అంది

గదా మాఅమ్మ 'ఎవరెవరు వస్తారు నాతో చెన్న పట్నం?' 'నేనూ, నేనూ' అని మా యిద్దరన్నయ్యలు అక్క చేతులెత్తారు. నేనా పిరికి. మాటపడిపోయి నట్టు కూర్చున్నా. 'సరే మీముగ్గుర్నీ తీసుకువెళ్తా', అంది మాఅమ్మ. 'పాపం చెల్లెమ్మో' అన్నారు ముగ్గు రూనూ, 'ఆ, అదెందుకూ! నామాట వినదుగా: జనవసరము లేదు దానికి, వాళ్ల నాయనతో యిక్కడే వుంటుంది' అనేటప్పటికి నాకు దుఃఖమాగక కెవ్వు మని యేడ్చేశా. మాఅక్క కళ్లు తుడుచుకోవడం మొదలెట్టింది. మాఅన్నయ్యలు తడిచేసుకున్నారు కళ్లు. అందరమూ చిన్నవాళ్లమే. 'శ్రుతిమించి రాగాన్ని బట్టు' గొంతుకలు హెచ్చయ్యాయి. ఇల్లు గొల్లు మంది ఎంచేతో మాఅమ్మకికూడా దుఃఖమువచ్చేసింది. గబగబావచ్చి నన్నెత్తుకొని 'యింకేడవకు, బుద్ధిగా వుంటావుకదూ, శ్రద్ధగా చదువుకొని నేచెప్పినట్టు వింటే నిన్నుకూడా తీసుకువెళ్తా పట్నం' అనంటూంటే వెక్కుతూ వెక్కుతూ 'వింటానమ్మా, వింటానమ్మా' అని లెక్కలేనన్నిమాట్లనేశా, మళ్లీ మానాన్న వచ్చే టప్పటికి మాఅమ్మ నాకన్నంతినిపిస్తూవుంది. ఆశ్చర్య పోయారు. ఎట్లా సమాధాన పడ్డారనేటప్పటికి మా అన్నయ్యలున్నారుగా, గొల్లుమని చెప్పేశారు జరిగిం దంతా. మానాన్న నవ్వుకున్నారు. ఇకచూడండి, అప్ప టినుంచి మాఅమ్మంటే హడల్. చదువు పూర్తయి స్కూలులో ప్రవేశించేదాక వొకదెబ్బతింటే ఒట్టు.

శ్రీమతి గుడిపూడి ఇందుమతీదేవిగారు

# కోయిల

గీ॥ బిడ్డలను గంటివేగాని పెంచుటెఱుగ, వకట పలుగాకిపంచల యందువిడిచి
తిరుగ మనస్సెట్లొప్పెనో తెలియరాదు, కోయిలా హాయివిహార చిగుళ్లమెక్క.

గీ॥ సోమరితనంబుచే నీవు ప్రేమవదలి, కన్నబిడ్డలవిడిచితి గాని కఱకు
కాకి విడువగలేదాయె గదవె పికమ, పెంచిపెద్దజేసెను తన బిడ్డలటులె.

గీ॥ నీకు బిడ్డలబెంచెడు నేర్పునీక, కాకియును నీవు బిడ్డల గనెడుకాల
మొక్కటిగజేసి యాదైవ మొసగెనీకు, పిల్లలను కాకిగూటిలో బెట్టుతెలివి.

గీ॥ గ్రుడ్డిదాకాకి యివి తనబిడ్డలంచు, నెంచె పికసంతతియటంచు నెఱుగలేదు
దానికాతెల్వి లేమి యాతండె యొసగె, నీశ్వరుడు వానికి వినోద మిట్టిపనులు.

గీ॥ పెద్దయైసంచరించు నీబిడ్డలిపియటంచు, నెపుడైన గని గుఱుతించినావె
మించి కడుకూర్మితో బల్కరించినావె, మంచిపాటలువిని సంతసించినావె.

గీ॥ జంటజంటలుగాజేరి వెంటవెంట, నంటిపండెమువైచి యొండొంటిమీటి
లీలకుత్తుకబంటిగా లేతచిగురు, మెక్కిపాడెడుపాట లే చక్కిబోయె?

గీ॥ ఆవసంతునివెంటనే యరిగె నొక్కొ, యింతలో పిల్లలనుగంటి వేమొయింక
పాటసాగకపోయెనో పరభృతంబ, నీకు లేదాయెబిడ్డల సాకుచింత
యింక నేయడ్డమున్నదో యెఱుగరాదు.

గీ॥ సల్లలిత పల్లవిత వృక్షశాఖలందు, పల్లెటూళ్ల యందెపుడు గన్పడెదవైన
గాని నీపాటవినరాదు గదవె పికమ, పాటవంబొప్ప నొకపాట పాడవేల.

గీ॥ నిన్ను నీతల్లిపెంచదు నీవు నీదు,బిడ్డలను పెంచలేదు నీబిడ్డలంతె
వంశపారంపరిగనిట్లె వచ్చుచుండె, తాతనాటి బోలెయొగదా తరతరాన.

# రషీదా

విశాల విశ్వనాథశాస్త్రిగారు

రషీదా యుక్తవయస్సున నున్న నవయౌవనవిలాసవతి. ఆమె దేహము కలువను మించిన కాంతియు గులాబిపూవును బోలిన నిర్మలమైనదిగాను యొప్పుచుండెను. కెరటములబోలిన నొక్కునొక్కులచే విలసిల్లు యామెకురులు భుజములమీనుండి పిరుదలనంటుచున్నవి. ముంగురులు కనుబొమలమీద బడుటచే నూత్నవికాసమును గూర్చుచున్నవి.

బంగారువన్నెగల్గిన పట్టుచొక్కాయిని ధరించి పలువిధములైన ఫణులతో నిండిన నల్లనిచీర యగ్రభాగము భుజమునుండి క్రిందకుజారుచు యామె యనాదరణము జూపుచున్నది. పచ్చనిపాదములకు యామె ధరించిన యెర్రనిజోళ్లు ముద్దులగొల్పుచుండెను.

యంగసౌష్టవము గల యొక నిండైన విగ్రహము యామె యెదుట నిలువబడియుండెను. రషీదా ఆతని నేదియో వేడుకొనుచుండెను. "నా రహస్యమును నీవెట్లు గ్రహించగల్గితివి" అని యావ్యక్తి ప్రశ్నించెను.

"గ్రహించుట కష్టసాధ్యమేకాని దైవవశమున నాకు దెలియవచ్చినది" అని రషీదాపల్కెను.

"సరియే నీవు చెప్పబోవునదేమి" యని పురుషుడు కఠోరముగ పల్కెను.

"తండ్రీ నీవిప్పుడు నిజముగా చంపనెంచితివా" అని రషీదా దీనముగ పల్కెను.

"నోరుమూయుము" తండ్రి గద్దించెను.

"అయ్యో తండ్రీ! ఆతడు మన ప్రభువు కాడా?— కరుణార్ద్రహృదయుడే నిష్పక్షపాతియే మతోద్ధారకుడే! నిక్కముగా నాకే వేయిజీవములున్న ప్రతిదానిని యాతనికి కల్గెడి యే చిన్న యాపదనుండియు రక్షించుటకే ధారవోయుదును - తండ్రీ నీ యుద్దేశ్యమును మానుము." రషీదా వేడుకొనెను.

"ఆతని జంపక దప్పదు" పురుషుడు పల్కెను.

"నీవు నాకుమాత్రమే తండ్రివి కాని యాతడు లక్షలాదిజీవములకు తండ్రి. ఆతని ప్రాణము విలువయైనదికాదా?" నిట్టూర్పు విడచి "తండ్రీ! క్షమింపుము. నీవు నిక్కముగా దేవునియెడల ద్రోహము దలపెట్టితివి. దేశమున కరిష్టమును దెచ్చుచున్నావు."

ఆతనిముఖ మెఱ్ఱబారెను.

"పొమ్మావల. జనానా నీ వుండదగినది" తండ్రి కుపితుడయ్యెను.

రషీదా కను లశ్రుపూరితము లయ్యెను.

"తండ్రీ! నాప్రియమైనతండ్రీ! నన్ను కరుణింపుము. రాజభక్తిని దలంపుము. దైవమును మదినెంచుము. మాతృభూమిని కాపాడుము. పాపపుణ్యములు - నీకా

వినీత్యములు గ్రహించుము. తండ్రి అక్బరును బ్రతుకనిమ్ము” రషీదా తండ్రి కాళ్లంటెను.

“ఛీ! నీచురాలా”అని తన్ని కోపముతో గదివిడిచి ఎచ్చటకో పోయెను. రషీదా హృదయము మాందోళనజెందెను.

జయచిహ్నముగా నిర్మింపబడిన కుతుబ్ మీనార్ ఢిల్లీ కనతిదూరములోనేయుండెను. దానియగ్రము యాకాశము తాకుచున్నదో యనునట్లుండెను. దాని పరిసరప్రాంతమంతయు పెనువృక్షములచే దట్టముగా నిండి యుండెను. యచ్చటచ్చటమాత్రము కనుచూపు దూరములో నివాసగృహములు మాత్రముండెను. సాయంసమయమగుటచే జనసంచారము లేక నిర్మానుష్యమైయుండెను. కాని గూళ్లకు జేరుకొనుపక్షుల కిలకిలారావముల ధ్వని మిక్కుటముగానుండెను. సూర్యభగవానుడు పూర్తిగా యస్తమించెను. చంద్రుడు తన కిరణజాలము వ్యాప్తి జేయుచుండెను తారాబృంద మొక్కొక్కటియే బయలుబడుచుండెను.

అత్తరి నొకవ్యక్తి అశ్వారూఢుడయి ఒంటరిగా కుతుబ్ మీనార్ ముఖద్వారమున కేతెంచెను. వ్యక్తిని జూడ మిగుల యుత్తముడుగ దోచుచుండెనుకాని యాతని విగ్రహముమాత్రము మిగుల విస్మయము గొల్పుచుండెను. గుఱ్ఱముపైనున్న యాతని తీరును జూడ గుఱ్ఱపుస్వారియం దారితేరినట్లు జెప్పకజెప్పుచుండెను. అంతట యా వ్యక్తి రోజుచు మెల్లిగానడచుచున్న యాతని గుర్రముదిగి మెల్లిగా కుతుబ్ మీనార్ లోనికి బోవుటకై మెట్లెక్కుచు ప్రకృతి సౌందర్యము జూచుచుండెను.

యిదియంతయు జాగరూకతతో గ్రహించుచుండిన యొకవ్యక్తి వృక్షముల చాటున నుండి యాతని వెన్నాడుచు కలసికొని తన మొలనున్న బాకునుతీసి “చావుము మహామ్మదీయ విధ్వంసకుడా”అని గద్దించెను.

మెరపుతీగవలె తటాలున నొకవ్యక్తి వెనుకనుండివచ్చి యాతనిచేయి వెనుకకు లాగెను. అంతట ద్రోహి వెనుకకు దిరుగ అక్బర్ ఆతనిచేతనున్న బాకు నూడబెరకి యాతని నిరాయుధునిగా నొనర్చెను.

వెంటనే హయారూఢులయిన మొగల్ యోధులు యచ్చోటికి కరుదెంచి యా ద్రోహిని ముట్టడించిరి.

“రహిమాన్! ఈహంతకుని చేజిక్కంచుకొనుటకు మంచిసమయమునకే విచ్చేసితివి. అల్లా నిన్ను రక్షించుగాక'' యని దీవించెను. రహిమాన్ గౌరవపూర్వకముగా అక్బరునకు వంగి

“రాజా ద్రోహుల కాకరమైయున్న యిచ్చోటునకు తమ రొంటరిగా వచ్చుట వినియుండి తమ రక్షణార్థమై వచ్చియుండుట మంచిదని తలంచితిని.”

“అనూత్న వ్యక్తిమూలమున బ్రతికితిని. లేకున్న యీపాటికి వధింపబడియుందు” నని అక్బరుపాదుషా యానూత్నవ్యక్తి కొరకై మెట్లు డిగెను. నూత్న వ్యక్తి

మాయమయ్యెను. కలయు వెదకిరికాని కాంచనైరి.

మరునాటి యుదయమున అక్బరు స్వయముగా ద్రోహివిషయమై తీర్పును జెప్పుటకై నిండుకొలువున లేచి యుత్తమాసనము నధిష్ఠించెను. పాదుషాప్రియులైన అబుల్ ఫజల్ యొకవైపునను మానసింహు డొకవైపునను రాజదుస్తులలో యుచితాసనముల నాసీనులై యుండిరి. తదితరహిందూ మహమ్మదీయ మహామంత్రులును, పెక్కు యాస్థానోద్యోగులును, చూపరులును తమతమ స్థానములందుండిరి. ఇట్టి నిండుసభా మధ్యమున అక్బరుముఖమున రాజఠీవియు మూర్తీభవించిన ధర్మమును యావరించియుండెను.

ఆత్మగౌరవమున కావంతయు లోటురానీయక తానొనర్చిన తప్పిదమునకై తలవంచుకొని ఖడ్గదారులయిన యిరువురు యోధుల మధ్య ద్రోహి నిలువంబడి కొలువంతయు తన వైపునకు త్రిప్పుకొనియుండెను.

అబుల్ ఫజల్ లేచి నేరారోపణపత్రమును జదివి హంతకుని జెప్పుకొనదగిన నేదైన యున్నదేమో యడిగెను.

హంతకుడు మాట్లాడలేదు.

"నీయిష్టదైవమును దలంచుకొమ్ము. నీవిప్పుడే మరణమందెదవు" అని మరలఅబుల్ ఫజల్ ద్రోహి నుద్దేశించిబల్కెను.

ద్రోహి బలుకలేదు.

మరణదండన విధించుశిక్షాపత్రము వ్రాయబడెను. దానిపై నక్బరు సంతకమును జేయగా రాజముద్ర వేయబడెను.

అంతట నొక ద్వారపాలకు డేతెంచి అక్బరునకువంగి

"మహారాజా! యెవ్వరో యొకవ్యక్తి తమ దర్శన మపేక్షించుచున్నాడు."

"ఎవరాతను ఏమికావలయు"నని అక్బరు ప్రశ్నించెను.

"అయ్యా ఆవిషయమేమియు నాతో జెప్పకున్నవాడు" అనెను.

అక్బరు ద్రోహిని ప్రక్కనున్నగదిలో బెట్టించి వేచియున్నవ్యక్తిని రానాజ్ఞాపించెను.

వ్యక్తి ఇడలేని యడుగులతో లోనప్రవేశించుచుండెను.

అక్బరు వెంటనే తన స్థానమునుండిలేచి చేతులుచాచి "మిత్రమా రమ్ము నాప్రక్కను గూర్చుండుము" అని వైరియానందముతో యాదరించెను.

ఆవ్యక్తి పీఠమునకు కొంచెము దూరమున నిలువంబడి ప్రణామము లాచరించి "ఆర్యా! క్షమింపుడు. నాకొకచిన్నవరము

"మిత్రమా! నీకేమి కావలయును. యుద్యోగమా?-అధికారమా?-ధనమా?" అని యాతురతలో యడిగెను.

"మరేమి? తక్షణమే వేడికొనుము యీ అక్బర్ సంసిద్ధుడైయున్నవాడు"

"తమనోట యొక క్షమార్పణమాటయే" వ్యక్తిబాధచే రోజుచుండెను.

అక్బరువ్యక్తిని వైరిగా జూచుచు "క్షమార్పణ" అని తెల్లబోయెను.

"అంతియే! తమను వధింపదలచిన యాతని క్షమించుటయే!" వ్యక్తిపల్కెను. సభయంతయు విస్మయమందెను. అక్బరు మం మాందోళనజెందెను.

"అతడు ద్రోహి. నాప్రాణములు దీయ నెంచెను."

"తమను నేను రక్షించితిని. యిట్లు పల్కినందులకు క్షమింపుడు. నాకోర్కె మించియున్నదా ?"—

"అక్బరువలె నీకోర్కె దీర్పగలను కాని చక్రవర్తిగా నీయజాలను. నే ద్రోహియైన నన్నైనను శిక్షించుకొనవలనదే" అక్బరు పల్కెను.

"తమను రక్షించుటలోనే గాయములం దితిని దానికి ఫలితముగా నేనిప్పుడు జావ నుంటిని" వ్యక్తిపల్కెను.

"మిత్రమా! లోకమున గొప్పవైద్యుడు నీకు పరిచర్యలొనగలుగు" అక్బరనెను.

"యిక నన్నెవరెను రక్షింపజాలరు. తమకై ఏర్పరుపబడిన బాకు విషపూరితమైనది. గాయము కొంచెమైనను బాధ భరింపరా నిది." వ్యక్తి నిశ్చేష్టితుం డగుచుండెను.

"నాకిక కొలది నిముసములుమాత్రమే యున్నవి, రాజా! నాకోర్కె నెరవేర్పుడు నా తండ్రిని బ్రతికింపుడు. అల్లా తమ్ము నెల్లప్పుడు కృపజూచును"అని దీనముగా చేతులు జాపెను. అశ్రువులరాల్చెను. కొలువంతయు కరగిపోయెను.

విషమంత కంతకు పనిచేయదొడగెను. ముద్దులమోమున నీలమువ్యాపింపదొడగెను. అక్బరు తన్నుతానే మరచెను. హృదయము కరగిపోయెను. కనుల నశ్రువులు వ్యాపించెను. తక్షణమే వణకుచున్న హస్తములతో నాజ్ఞా పత్రము చింపివై చెను.

యువకునికాళ్లు తడబడుచుండెను. అక్బరు పీఠమునుండి పర్వెత్తి నావ్యక్తిని బట్టుకొని అదరెకు పెదవులతో"మానసింహా! వైద్యుని పిలుపింపు"మనెను.

మానసింహుడు తక్షణమే వైద్యునికై పర్వెత్తెను. వ్యక్తి అక్బరు నాధారముజేసికొని మెల్లగ పాదములపైబడి ముద్దుకొని వణకుచు రాజా!నన్నాతని జూడనిమ్ము"అని దీనముగా వేడెను. వెంటనే అక్బరు ద్రోహి నచ్చోటికి దే నాజ్ఞాపించెను.

ద్రోహివచ్చుట తడవుగా అతి ప్రయాస ముతో"తండ్రీ"అని యాతనిమీద వ్రాలెను.

"బిడ్డా! రషీదా"యని ద్రోహికంట తడి పెట్టుచు కూతును పొత్తిళ్లలో హత్తుకొనెను.

రషీదా తలనున్నపాగా క్రిందబడెను. ముఖమంతకంతకు నీలిమయ్యెను.

"అక్బర్ ..."అని రషీదాయేమో జెప్ప బోయెను. అక్బరు వినుటకువేచి యుండెను. రషీదాకుమాటలేదు. రషీదా తండ్రిచేతులకు బరువయ్యెను."రషీదా"యనిద్రోహియొక్క పెట్టున యేడ్చెను. అక్బర్ నిశ్చేష్టుడయ్యెను.



పార్వతీపురము 'శ్రీరామకృష్ణ భక్తసమాజము.'
అధ్యక్షురాలు శ్రీమతి ముస్తా కోటీశ్వరమ్మ మధ్యకూర్చున్నారు. మిగిలినవారందరు
కార్యనిర్వాహకులును, సభ్యురాండ్రును. వెనుకనున్న బాలిక లీ సమాజమున
నుచిత విద్య బడయువారు.

# నేటి రాజకీయాలు – స్త్రీలు

శ్రీమతి కొమఱ్ఱాజు అచ్చమాంబగారు, ఎల్.ఆర్.సి.పి., ఎస్.ఎల్.ఎస్.

దేశాభివృద్ధికి రాజకీయ పరిజ్ఞానము చాలా అవసరం. అధికలగాలంటే దీనినిగురించిన ప్రచారం విరివిగా చేయాలి. వాటిలో రాజకీయసభలు ఎంత యెక్కువగా జరిపితే అంతమంచిది. *

మనదేశ స్వాతంత్ర్యమునకై చాలా కాలమునుంచి పోరాడుచున్న రాజకీయ సంస్థలలో ముఖ్యమైనది కాంగ్రెసు సంస్థ. కాని మహాత్మ గాంధిగారి అసహాయోద్యమ ప్రారంభము వరకును "దేశము మనది, రాజ్యము చేసుకోవలసింది మనము, హక్కులు యిచ్చేటందుకు, ఈయకపోవుటకు అధికారము గవర్నమెంటుకేమున్నది?" అనేసంగతి మనకు తెలియలేదు. ఇంకా ప్రార్థనలు, ఎవ్వరో ఇవ్వటం మనం పుచ్చుకోవటం అనే అభిప్రాయాలతోనే ఉన్నాం. మొన్న మొన్న 1930వ సంవత్సరంలోగాని "మనకు కావలసినది సంపూర్ణస్వతంత్రము. అదే మన ఆదర్శము. అది తప్ప మనకు వేరే ఆదర్శము ఉండకూడదు" అని మనము తెలుసుకోలేక పోయాము.

ఇప్పటికి 50 సంవత్సరముల పై కాలమునుంచి మనము పోట్లాడి యిప్పటికి యేమి సంపాదించాము! గడచిన యూరోపా మహాసంగ్రామంలో హిందూదేశము చేసిన ధనమనుష్య సహాయానికి సంతోషించి బ్రిటిష్ ప్రభుత్వమువారు 1919లో మాంటేగ్యుఛెమ్సుఫర్డు రిఫారమ్సు అను రాజకీయసంస్కరణము లొసంగిరి. దానివల్ల అ తపూర్వమునకంటె వోటర్లసంఖ్య యెక్కువైనది. అముఖ్యమైన కొన్ని చిన్న ప్రభుత్వశాఖలు ప్రజలచేత యెన్నుకొనబడిన మంత్రులవశము చేయబడినవి. దీనివల్ల మనకు నిజంగా వచ్చినదేమీ లేదు. అయితే 10 యేండ్ల తరువాత మళ్లీ కొన్ని హక్కులిస్తామని ఆశమాత్రం పెట్టారు. కాంగ్రెసువారు ఈ రాజ్యాంగవిధానాన్ని నిరసించి బహిష్కారము చేసారు. కాని గవర్నమెంటువారు యేమాత్రం చెయ్యలేదు. మన సరుకు తెలును కాబట్టి పట్టువదలలేదు. తరువాత పదేండ్లకు బ్రిటిష్‌గవర్నమెంటువారు మనదేశం అంతా వద్దని ఘోషిస్తున్నా సైమనుకమీషను మనదేశానికి పంపటం, హిందూదేశం ఆ కమీషనును బహిష్కరించి నిరాకరించటం మనకు తెలిసినవిషయమే. తరువాత జరిగిన రెండు సత్యాగ్రహములవల్లను మూడు రౌండుటేబిలు కాన్ఫరెన్సులవల్లను మనకిప్పుడమలులో యున్న ఇండియన్ కాన్‌స్టట్యూషనుయాక్టు లభించింది. యథాప్రకారానికి మోసంలేకుండా రాజకీయంగాగాని ఆర్థికంగాగాని మనంతట మనం పైకి వచ్చేటందుకు సహాయపడగలిన ఒకహక్కు ఇందులో లేదు. రాజ్యం చేయుటానికి ముఖ్యమయినడబ్బు సైన్యము ఈ రెండింటిమీద మన కేవిధమయిన హక్కులేదు. ఇంటిఖర్చుకు డబ్బు యివ్వకుండా సంసారము గడపటమంటే యెంతసబబో డబ్బు ఖర్చుచేయుటకు స్వతంత్రము లేకుండా రాజ్యభారము వహించి దేశాన్ని సరిదిద్దమనటం అంతహాస్యాస్పదం. కాంగ్రెసుకూడా యీ ఆక్టును అమలులో పెట్టి పనిచేయడం ఎంతకష్టమో శాసనసభలలో ప్రవేశించి చూపిద్దామనుకొన్నది ఉత్సాహంతో పనిచేసి కాంగ్రెసు అసంఖ్యాకములగు ఓట్లమెజారిటీతో ప్రతిచోట గెల్చొంది శాసనసభలలో ప్రవేశించింది. దీన్నిబట్టి దేశంలో కాంగ్రెసుకున్న పలుకుబడి గవర్నమెంటుకు పూర్తిగా అర్థమైంది. ఇక కాంగ్రెసువారు తాము శాసనసభలలోనికి ప్రవేశించి

* షామణ్ణు తూర్పుకృష్ణాజిల్లా రాజకీయ మహిళాసమావేశాధ్యక్షోపన్యాసమునుండి

రాజ్యభారము వహించుటకు ముందు గవర్నరులను తమ "వీటో" అధికారమును, ప్రత్యేకబాధ్యతాధికారములను ఉపయోగించమని వాగ్దత్తముచేయుమని కోరిరి. దానికి గవర్నమెంటువారు ఒప్పుకొనలేదు. కాబట్టి కాంగ్రెసుసభ్యులు మంత్రిపదవులను స్వీకరించలేదు. ఇటువంటి సమయమున గవర్నమెంటువారు ఇన్‌స్ట్రుమెంటు ఆఫ్ ఇన్‌స్ట్రక్షన్సు (Instrument of Instructions) లో ఉన్నప్రకారము వర్తించక తమ యిష్టప్రకారము తాత్కాలిక మంత్రులను నియమించి నిరంకుశముగా ప్రవర్తించుచున్నారు.

ఈఆక్టును యిచ్చేటప్పుడు రౌండుటేబులు కాన్ఫరెన్సులలోను, పార్లమెంటులోను గవర్నమెంటువారు ప్రజాపరిపాలనమును రాష్ట్రీయ స్వాతంత్ర్యమును మనకు యిచ్చుచున్నామని తెలిపియున్నారు. ఇటీవల ఇండియామంత్రి జెట్లండు ప్రభువు పార్లమెంటులో ఉపన్యాస మిచ్చుచు ఈ ఆక్టువలన సంపూర్ణరాష్ట్రస్వాతంత్ర్యం మనకు లభించినదనియు గవర్నర్ల ప్రత్యేకాధికారములు కూడా మంత్రులతో ముందుగా ఆలోచించి సలహాతీసికొని వినియోగింపబడుననియు, రాష్ట్రీయ ప్రభుత్వశాఖలన్నింటియందును మంత్రులకు సంపూర్ణ బాధ్యతాయుతమైన అధికారముకలదనియు చెప్పియున్నాడు. ఇది నిజమేనైనచో కాంగ్రెసువారు కోరిన హామీని యిచ్చుటకు ప్రభుత్వము వారెందుకు వెనుదీయుచున్నారో తెలియదు. ఇటీవల అలహాబాదులో జరిగిన కాంగ్రెసువర్కింగు కమిటీ తీర్మానం ప్రకారం మంత్రులకును గవర్నరులకు ఒక విషయమున అభిప్రాయభేదముదయించినచో, గవర్నరు తన ప్రత్యేకాధికారముల నుపయోగించుటకు పూర్వము మంత్రులను డిస్‌మిస్‌చేసి వేరొకమంత్రివర్గము నియమించుటయో, అది సాధ్యము కానిచో శాసనసభలను రద్దుచేసి క్రొత్తయెన్నికలు జరుపుటయో చేయవలెనని కోరియున్నారు. అనగా అట్టి అభిప్రాయభేదముయొక్క ఉచితజ్ఞతను నిర్ణయింపవలసినవారు వోటరులేకాని గవర్నరుకాదని కాంగ్రెసువారివాదన. ఇది ప్రజాపరిపాలనా సూత్రములకు పునాది అని అందరెరింగినదే. ఇంగ్లండులోను, తదితర పాశ్చాత్య ప్రజాప్రభుత్వ దేశములలోను ఈసూత్రము లమలులో నుండగా మన దేశమునకు మాత్రమిది యేలవర్తింపచేయకూడదో ఊహింపజాలకున్నాను.

గవర్నరులను కాంగ్రెసువారడిగిన హామీనిగురించిన వాదోపవాదములలో అసలు మన రాజకీయలక్ష్యము సంపూర్ణ స్వాతంత్ర్యమనే సంగతిమరచిపోయినట్లు కనపడుతుంది. వాదవివాదాలను పెంచి యేదోయొక అముఖ్యమయిన విషయముపైన తమ శక్తిసామర్థ్యములను ధారపోసి వృథాచేయుట మన నాయకులకు అలవాటైంది. పదిమాట్లు చెప్పుటవల్ల ప్రాముఖ్యత రాదు. ఎంత ముక్తసరిగా మాట్లాడినను అంత విలువయుండును. కాంగ్రెసు నాయకులింతటితోనైనా తాత్కాలికమంత్రుల గురించిగాని ఇండియామంత్రి గాని తదితరులు గాని యేమైన సహాయసూచనలను చేతురా అను విషయమును గురించిగాని చర్చలు మానేస్తే బాగుంటుంది. మనము ప్రతినిధులను ఎన్నుకున్నాము. వారిని గవర్నమెంటువారు శాసన సభాభవనములో సమావేశమగుటకు పిలువలేదు. దీనివల్ల శాసనసభ అంటే గోడలతో చుట్టబడిన భవనము కాదని భగవంతుడు తెల్పగోరుచున్నట్లున్నది. "ప్రజాప్రతినిధుల వశముకాని ప్రభుత్వమునకు పన్నులివ్వకూడదు" అనే మొదలగు గొప్ప ఆదర్శములన్నీ నిర్మలమైన ఆకాశముక్రింద జరిగిన సభలోనే పుట్టియున్నవి. శాసన సభలకు మనలను పిలువలేదని విచారించినందువల్ల ప్రయోజనము లేదు. ఆలాపిల్చినయెడల గవర్నరులు, తాత్కాలిక మంత్రులు సంధిగ్ధావస్థలో ఉంటారు. అందువల్ల మనం చెయ్యవలసిన దేమంటే శాసన సభలకు పిలువక పోవుటవల్ల మరింత సంధిగ్ధస్థితి యేర్పడుతుందని గవర్నరులకు తెలిసివచ్చునట్లు చేయాలి.

మన దేశంలో మన మెటుబోయినను అన్నివైపుల బీదతనము, దుఃఖము, నిరుద్యోగము, నిరాశలే కనపడు చున్నవి. తనను గాని తనమీద ఆధారపడియుండు వారినిగాని పోషింపలేని ఇంటియజమానులు కూటికిలేక మాడుపిల్లలు, జీతముబత్తెము లేకుండా జీతగాండ్రవలె యెల్లప్పుడు పనిచేయుభార్యలు, శక్తిగాని ఇష్టంగాని లేకపోయినా పిల్లలనుకంటూ విచారముచేతను లేమిడి చేతను క్రుంగిపోవుచున్న తల్లులు, పనులుదొరకక యేమిచేయవలెనో తెలియక నిరుత్సాహమువల్ల అధో పతినులగుచున్న యువకులు వీకే యెచ్చటికి పోయి నను మనకగపడుచున్నారు. దీనికి విరుద్ధముగా మహా రాజులయొక్కయు, జమీందారులయొక్కయు, ధని కులయొక్కయు వైభవములును, గవర్నరులు మొదలగు గొప్పఉద్యోగుల యొక్కయు వైభవము లును మరియొక ప్రక్కకనిపించుట చూడగా యిట్టి పరస్పరవిరుద్ధవిషయములు ప్రభుత్వమునకు కళంక ములు. ఇట్టివాటికి తావిచ్చి పోషించుచున్నంతవరకు మనకు ఉత్సాహము గాని అభివృద్ధిగానిలేవు. దేశ పరాధీనత తొలగించి దేశ స్వాతంత్ర్యముకొరకు దీక్షగా యెటువంటిజంకులేక పనిచేయు యువతీయువకులు మనకు కావలసియున్నారు.

ప్రస్తుతం మనం అధోగతిలోనున్నాము. మనకు పెండ్లివృత్తి. పిల్లలనుగనుట విధ్యుక్తధర్మము. ఇతరుల పైన ఆధారపడియుండుట తప్పించుకొనుటకు వీలులేని విధి. మన జీవితవస్తుపరమాణమంతా మనము పురుషుని చేతికీలుబొమ్మవలె ఉపయోగింపబడుటకో, లేకయెట్టి ప్రాముఖ్యతలేక పురుషుని భోగలాలసత్వమును మాత్రము తృప్తిపరచుట కుపయోగింపబడుటకో యేర్పరుపబడినట్లు అగపడుచున్నది. ఇందుకు అను గుణ్యముగా కావింపబడిన శాసనములు ఆచారములు మనలను పుట్టుకనుంచి చావువరకు వెన్నాడి మనజీవిత పారమార్థికమును అడుగడుగునకు చీల్చివైచి,పసితనము నందుగాని పెద్దవారమైన పిదప భార్యలుగా లేక తల్లులుగాగాని మనలను పురుషులతోపాటు సమాన హక్కు బాధ్యతలను అనుభవింపకుండా ఆటంక పరచుచున్నవి. వివాహవిషయములోనేమి, దత్తత, వారసత్వము, ఆస్తి సంక్రమణవగైరా హక్కుల విషయములలోనేమి మనకొరకు విధింపబడి అమలులో నున్న శాసనములు మన జీవితములను పంజరములలోని చిలుకలుగామార్చివేసి బంధించివైచుచున్నవి. పురుషుని యిష్టము వచ్చినంతకాలమువరకు మాత్రము, పురుషుని యిష్టప్రకారము పరిమితముగా స్వేచ్ఛావాయువును పీల్చుట కవకాశమిచ్చు పురుషుని భర్తగా గల్గిన భార్యయే అదృష్టవంతురాలని మనలో చాలామంది అభిప్రాయము. ఇదియంతయు పురుషుని నిరంకుశ శాసనములకు తరతరములనుండి అలవాటుపడి యున్న మనస్సులు కల్పించుకొన్న భ్రమలే కాని నిజములుకావు. నిజమునకు మనముకూడా పురుషునితోపాటు రాజకీయ, ఆర్థిక, సాంఘికాది అన్నివిషయములలోను సమానముగా హక్కు బాధ్యతలుకల్గి మన వ్యక్తిత్వమును సంపూర్ణముగాను స్వేచ్ఛగాను పెరుగుటకు అవకాశములు కల్పించుకొన వలసియున్నది. ఇందుకు మీకు నేను చెప్పు సలహా ఏమనగా మీరుకూడా రష్యా, ఫ్రాన్సు మొదలగు యితరదేశపు స్త్రీలవలె మీ మీహక్కుబాధ్యతలను గుర్తించి స్వాతంత్ర్యేచ్ఛనుపొంది మనదేశముయొక్క రాజకీయార్థిక దాస్యమును తొలగింప సిద్ధముకండు. అంతవరకు మనకును మనదేశమునకును మోక్షములేదు. ఇప్పు డమలులోయున్న హిందూదేశ రాజ్యాంగ చట్టముప్రకారము యిటీవలజరిగిన యెన్నికలలో 56 మంది స్త్రీలు గెలుపొంది శాసనసభ్యురాండ్రుగా యున్నారు. వీరందరుకూడా కాంగ్రెసు ఆదర్శనము లనే తమ దృష్టియందుంచుకొని మాతృదేశ రాజకీ యార్థిక స్వాతంత్రమునకై తమ యావశ్శక్తిని విని యోగింతురని నమ్ముచున్నాను.

# శ్రీమతి కాళ్లకూరి మహాలక్ష్మీసుందరమ్మ బి.ఏ. ఆనర్సు

దుగ్గిరాల సూర్యప్రకాశరావు పంతులుగారు

కాకినాడ వాస్తవ్యులగు శ్రీ బాలాంత్రపు సుందరరామయ్య, శేషమ్మగార్ల కేక పుత్రికయు సుగుణవతియునగు శ్రీమతి కాళ్లకూరి మహాలక్ష్మీ సుందరమ్మగారు బి. ఏ. ఆనర్సు పరీక్షయందు ద్వితీయకక్ష్యలో నుత్తీర్ణత చెందిరనువార్త స్త్రీలోకమునకే కాక యావదాంధ్రులకు నానందకారణము.

ఈమె 10 సంవత్సరముల వయస్సు మొదలు 14 సంవత్సరములవరకు శ్రీ కాకినాడ విద్యార్థినీ సమాజమువారిచే స్థాపింపబడిన మహిళా విద్యాలయమున సంస్కృతము చదివి సాహిత్యశిరోమణి ఎంట్రన్సు పరీక్ష పూర్తిచేసినది. అనంతరము బెనారస్ యూనివర్సిటీకి ప్రయివేటుగా స్కూలు ఫైనలుకట్టి ప్యాసై మరి రెండేండ్లు ప్రయివేటుగా చదివి ఇంటరుకోర్సుకూడ కాశీ యూనివర్సిటీలోనే పూర్తిచేసినది. ఈమె కిప్పుడు 22 సంవత్సరములు.

తండ్రిగారు సంస్కృతాభిమానులగుటచే బాల్యమునుండి సంస్కృతమందు కృతపరిచయురాలైనది. సంస్కృత బి. ఏ ఆనర్సునందు కృతార్థత చెందిన ఆంధ్రరమణీమణి వేరొకరున్నట్లు కానబడదు.

మూడు వత్సరములు గురుకులవాసము సలిపి కష్టములను అనారోగ్యమును లెక్కచేయక పట్టినపట్టువీడక ఈమె యీపట్టము సంపాదించుట ఆంధ్రులకు న్యాయమగు గర్వకారణము.

మదరాసు ప్రసిడెన్సీకాలేజీలో నీమె ఈపరీక్షకు చదువుచున్న కాలమున నీమె బుద్ధి వైశద్యమును, విచక్షణ సమర్థతను గ్రహణశక్తిని మెచ్చుకొనుచు ఈమె తమ కళాశాలకు కీర్తితెచ్చునని తలపోయుచుండిన ఉపాధ్యాయుల విశ్వాసమీమె కృతార్థతవలన ధ్రువపడెను.

ఈమెభర్తయు ప్రస్తుతము ఏలూరులో మునిసిపల్ రివిన్యూఆఫీసరునైన శ్రీ కాళ్లకూరి శేషయ్య బి.ఏ. గారియొక్క మనఃపూర్వక ప్రోత్సాహమే ఈమె యిట్టి అత్యున్నత గౌరవమును బడయుటకు గారణభూతము.

వేషభాషలయందును ఆచారసంపదలయందును సంఘమర్యాదావలంబనమందును పెద్దలయెడల గౌరవము చూపుటయందును గుణవిద్యా సంపర్కముగల ఇతర హైందవ బాలికలవలె నిరసన భావములేక వికృతవేషములులేక పురాతనకాలపు టయిదువరాండ్రవలె సంచరించుచు సర్వజనసన్మానపాత్రురాలయ్యెను.

భగవంతు డీమెకు చిరాయురారోగ్యములిచ్చి రక్షించుగాక. ఈమెవర్తన నేటి విద్యార్థినుల కాదర్శప్రాయమగుగాక.

# స్త్రీలకు విద్యలేనిచో దేశమునకు ముక్తిలేదు*

శ్రీమతి వల్లభనేని సీతామహాలక్ష్మమ్మగారు

ముఖ్యముగా స్త్రీలకు విద్య ఎంతేని అవసరము. స్త్రీ అజ్ఞానురాలయిన బిడ్డలును అజ్ఞానులగుదురు. దేశమునకు స్వాతంత్ర్యము రావలెనన్న స్త్రీలు, యువకులు యెంతేని అవసరమని మన నాయకులు గగ్గోలు పెట్టుచున్నారు. కాని స్త్రీలే మూఢులయిన బిడ్డలెట్లు స్వాతంత్ర్య పోరాటమందు పాల్గొనగలరు? ఇది అసంభవము. కాన ముందుగా స్త్రీలకు విజ్ఞానావకాశములున్న తమబిడ్డలను వీరులనుగా తయారుచేసుకొందురు. కనుక ముందుగ స్త్రీవిద్యను గూర్చి నాయకులు, ప్రభుత్వము ప్రయత్నించవలెను. మనకు యీరోజున పత్రికాస్వాతంత్ర్యము, వాక్స్వాతంత్రము మరి యితర ప్రజాస్వామిక హక్కులు లేవు వాటికొరకై తీవ్రమైన ఆందోళన అవసరము.

యింతటితో సంతృప్తిపడక ప్రత్యేకముగా స్త్రీ విద్యాలయము లధికమగునట్లు ప్రయత్నములు చేయవలెను. స్త్రీలను పనిముట్లవలెను, కుక్కర్లవలెను, ఆటవస్తువులవలెను ఉపయోగించనీయకుండునట్లు, తప్పనిసరిగా విద్యనభ్యసించుట కవకాశముకలుగునట్లు ఒత్తిడిచేయవలెను.

## స్వతంత్రసంఘములు స్థాపించవలెను

ఎవరో చదువులుచెప్పించి స్త్రీలను స్వతంత్రులను చేసెదరని అనుకొనుటకంటె తమంతతామే సంఘముల నిర్మించుకొని, తమ శక్తిమీదనే ఆధారపడినచో ఎంతేని పనిజరుగగలదు. ఇప్పటినుండి ప్రయత్నించి మహిళాసంఘములు స్థాపించి వాటిద్వారా స్త్రీ స్వాతంత్ర్యము, స్త్రీవిద్య, బాల్యవివాహనిషేధములు, పునర్వివాహములు మొదలగు సాంఘికసంస్కరణలను ప్రబోధమొనర్చి సంఘములను బలవత్తరపరచి దేశకల్యాణమునకు, స్వాతంత్ర్యముకొరకు పోరాడు తదితరసంఘములకు చేదోడుగానుండి పురుషులతో పాటు స్త్రీలును శక్తికొలది జాతీయసేవయందు నిమగ్నము కావలెను.

## స్త్రీస్వాతంత్ర్యనిరోధము

యీనాడు సంఘములలో స్త్రీకి ఎట్టి స్వాతంత్ర్యమును లేదు. నాటకాలు, సినీమాలు, మొదలగువాటికి వెళ్లుటకు పురుషు లంగీకరింతురు కాని మామూలుగా సభలకు వెళ్లుటకుగాని, మాట్లాడుటకుగాని యీనాడుసంఘ మంగీకరింపజాలదు. విజ్ఞానార్జనకు యీ సంఘ మంగీకరింపదు. ఇంటియందేయుండి కూపస్థమండూకమువలె వంట మొదలగు పనులనే చేయుచుండవలె కాని విద్యాలయములకు వెళ్లుటకు స్వేచ్ఛ లేదు. ఏమి యీ అన్యాయము! స్త్రీ వంటరిగా ఎచ్చటికి ప్రయాణము చేయరాదుకదా! ఆర్థిక స్వాతంత్ర్య మంతకుముందే లేదు. ప్రభుత్వ మీ విషయముల కడుశ్రద్ధవహించవలెను. స్త్రీలు ప్రస్తుత సంఘదాస్యమునుండి విముక్తులయిననే కాని దేశమును దాస్యమునుండి విముక్తిచేయజాలరు. ఇతరదేశములందు స్త్రీలు స్వతంత్రులుగానుండబట్టియే ఆయాదేశములు ఉచ్చస్థితియందున్నవి. యుద్ధమునందు స్త్రీలును సైనికుల పురుషులతోపాటు స్వాతంత్ర్యమునకు పోరాడుచున్నారు. ఇందులకు స్పెయిన్ దేశములోని వీరనారీమణులే ప్రత్యక్ష నిదర్శనములు.

* పామర్రు ప్రథమమహిళామహాసభాధ్యక్షోపన్యాసమునుండి.

అధికారమునందుండి సంఘమునందున్న లోపములను సవరించుచున్నారు. రష్యా మొదలగు దేశములలో పురుషులతోపాటు స్త్రీలుకూడ సామ్యవాద మనుభవించుచున్నారు.

## సామ్యవాదము – స్త్రీలు

సామ్యవాదమున స్త్రీలు పురుషులతోపాటు అన్ని విషయములలోను సమానమైన హక్కులు కలిగియుందురు. స్త్రీలు విద్యారహితులై, ఆరోగ్యముకొరకు యింతగాలినైన స్వేచ్ఛగా ననుభవించక కూపస్థమండూకములవలె గృహములలోనే పడియుండవలసిన అగత్యము లేదు. పురుషులతోపాటు విద్య నభ్యసించవచ్చును. ఉద్యోగములు చేయవచ్చును. వివాహమునందు సంపూర్ణస్వాతంత్ర్యతయే గలిగి తన ఇచ్చవచ్చిన వరునే స్వీకరించవచ్చును. స్త్రీలకున్న ప్రత్యేక యిబ్బందులలో కొన్ని మినహాయింపులున్నవి. స్త్రీలు గర్భిణీగానున్న పుడును, ప్రసవించిన కొన్నిదినముల వరకును, పూర్తిజీతముమీదనే సెలవులివ్వబడును. ఇట్టివి స్వాభావికముగ నుండవలసినవే. నారీమణులు కూడ యుద్ధమందు పాల్గొనవచ్చును. ఈవిధముగా సంపూర్ణావకాశములు స్త్రీలకుండుటచే, వారియొక్క సాహసము, తెలివితేటలు, చురుకుదనము బాగుగా కనబడుచున్నది కాని యిప్పటికిని నిద్రనుండి మేల్కొనుచున్న యీ రోజులందున్నూ, స్త్రీలను ఏదోవిధముగా నణగద్రొక్క విశ్వప్రయత్నములు చేయుచున్నారు. ఆ ప్రయత్నములు తెలిసికొని మోసపోవలదని సోదరీమణులకు హెచ్చరిక చేయుచున్నాను.

స్త్రీలు అబలలనియు, సుకుమారులనియు, బయటకువచ్చుట కనేక ఆటంకములుండుననియు, కాన గృహమునందేయుండి గృహాధిపత్యమునే వహించవలయుననెడి ప్రబోధము నానాటికి హెచ్చగుచున్నది. కవులుకూడ ఈ విషయములో భ్రమను పొందుచున్నారు. వారి చిత్తానుసారము నాటకములు, కల్పనాకథలు వ్రాసి ప్రజలను పెడమార్గముల పెట్టుచున్నారు. స్త్రీస్వాతంత్ర్యమునకు తప్పుడు అర్థములుతీయుట కడుఅన్యాయము.

అట్లుప్రవర్తించక, స్త్రీస్వాతంత్ర్యోద్యమమునకు సహాయము చేయవలసినదిగా కవులనూ, కథకులనూ ప్రార్థించుచుంటిని. "స్త్రీసామ్రాజ్య"మను నాటకములో ప్రదర్శించినరీతి దౌర్జన్యములు పురుషులు చేసిన చేయుదురుగాక, కాని స్త్రీలుమాత్ర మెన్నటికీ చేయజాలరు. స్త్రీకున్న జాలి, దయ, క్షమ, ఆలోచనాశక్తి మరెవ్వరికీ లేవని మహాత్మగాంధిగారే అప్పుడప్పుడూ వ్రాయుచుండిరి. మరియు నా నాటకములో స్త్రీల స్వాతంత్ర్యమునుగూర్చి ప్రకటించిన దంతయు కేవలము ఆక్షేపణీయమైయున్నది. స్త్రీ స్వాతంత్ర్య మా కవికి గిట్టనట్లున్నది. స్త్రీలకు స్వాతంత్ర్యమున్న ఇట్లేయగునేమోయని ప్రపంచము భయపడి అందులకు విరుద్ధముగా ప్రవర్తించవలెనని యీయన భ్రమపడుచున్నట్లున్నది. స్త్రీలు పాశ్చాత్యవిద్య నభ్యసించిన పాడయిపోయెదరనియు, గృహసంబంధమైన విద్యనే నేర్వవలెననియు వ్రాసినాడు. అట్లు తలచుట పొరపాటు. అందరూ పాశ్చాత్యవిద్యలను, గృహసంబంధమైన విద్యనూకూడా అభ్యసింపవచ్చును. మరియు స్త్రీలు సైనికులుగా ఉండుట కనర్హులనియు, స్త్రీలు ఉద్యోగములందుండి ప్రసవించుటచేతను గర్భవతులయి యుండుటచేతను, యితర యిబ్బందులచేతనూ ఎప్పుడు హాజరు కాజాలక పోవుచుండిరనియు చూపించుట చాల హాస్యాస్పదము. ఇది నారీమణుల ఉద్యోగములు చేయుచున్నచోట్ల సైనికులుగా నున్నచోట్ల అనుభవ విరుద్ధము. యిట్టి కవులయొక్కయు వ్యాసకారులయొక్కయు కల్లబొల్లి మాటలకు ప్రపంచము మోసపోవలదని మనవి చేయుచున్నాను.

# ఇదివరకు తెలియకపోతే—
# —ఇపుడు తెలుసుకొనండి

## నాణాల అంచుల్ని గరుకుగా ఎందుకు చేస్తారు?

పూర్వము నాణాలు ఇప్పటిమోస్తరుగా కాకుండా మోటగా ఉండేవి. ఇప్పుడున్నంత గుండ్రంగాకూడా ఉండేవి కావు. అందుచేత చాలామంది ఆ నాణాలలో చిన్న చిన్న ముక్కలను కత్తిరించుకొనేవారు. ఆ విధంగా ప్రతినాణెంలోను ముక్కలు పోయేసరికి వాటి విలువ తగ్గిపోయేది. ఈమాదిరిగా అపహరించడానికి వీలులేకుండా ఇపుడు తయారగుతూండే నాణాలను గుండ్రంగా చేసి అంచులు గరకుగా వుండేటట్లు ఏర్పాటుచేశారు. ఇప్పుడు కాస్త పిసరు కత్తిరించినా తెలిసిపోతుంది.

## మొదట లైటుహౌసు ఎవరు కట్టారు?

మొట్టమొదట కట్టబడిన లైటుహౌసు ప్రపంచంలో 'ఏడువింతలు' (Seven wonders) లో ఒకటిగా పరిగణింపబడేది. ఈ లైటుహౌసు ఫోరాస్ అనే దీవిలో కట్టబడింది. పూర్వం ఆర్కిటెక్టు సోస్ట్రాటసు అనేవాణ్ణి పెండ్లిచేసుకోందామని ఒకకన్య తన తల్లిదండ్రుల సహితంగా గ్రీసుదేశంనుంచి ఈజిప్టుకు నావలో వస్తూవుండగా ఒకరాత్రి చీకట్లో ఫోరాసు దీవి ప్రాంతంలో పెద్దరాతికి తగులుకొని నావ బ్రద్దలైపోయి అంతా చనిపోయారట. అది తెలిసి సోస్ట్రాటసు చాలా విచారించి తనప్రియురాలి జ్ఞాపకార్థంగా వుండేటట్టున్న ఆప్రాంతాలను ప్రయాణం చేసే నావికులకు ఉపయోగంగా వుండాలనిన్నీ పెద్ద లైటుహౌసు కట్టించాడు. అది నాలుగువందల అడుగుల ఎత్తుపైగా ఉండేది. లైటుహౌసు పైన నిరంతరం పెద్దమంటలు మండుతూ కిటికీలలోనుండి వచ్చేవెలుతురు నావికులకు అపాయంలేకుండా సహాయంగాఉండేది. ఈలైటుహౌసు 1500 సంవత్సరాలు పనిచేసింది. కాని పదునాల్గవ శతాబ్దంలో భూకంపము రావడంచేత అదికూలిపోయింది. లేకపోతే ఇప్పటికీ ఉపయోగిస్తూ ఉండేదే.

## సాలీడు గూడుకట్టడ మెందుకు?

సాలీడు ఎప్పుడూ గూడుకట్టుకోవడము కాలక్షేపంకోసం కాదు. అది చాల ఉపయోగమైన పని చేస్తూంది. అంత సన్నగా, మృదువుగా పట్టులాటి దారాలతో గూడుకట్టుకోవడానికి చాలా కారణాలున్నాయి. అవి కట్టుకొన్న గూళ్ళే వాటికి ఆహారము సంపాదించిపెడతాయి. ఈగలు దోమలు లాంటి ఇంకా ఇతర చిన్న పురుగులు ఎగురుతూండగా సాలెగూళ్లలో చిక్కుపడ్డాయంటే తప్పించుకుని పోలేవు. ఆగూళ్లు అంత దట్టముగా ఉంటాయి. ఈదారాలతోటే వాటి గ్రుడ్లు దాచుకొనేటందుకు పట్టుపురుగులుండే కాయలలాంటి కాయలను అల్లుకుని వాటిలో గ్రుడ్లను పెట్టుకుంటాయి. సాలెపురుగులు గూళ్లను రకరకాల అందమైన వలలులాగ కట్టుకోవడంవల్ల అనేక దేశాల్లో లేసులు అల్లేవాళ్లు సాలెగూళ్లను చూసి వాటిప్రకారము అందముగా అల్లుతూంటారట.

## తెలుపు నలుపు మనుష్యులు

దక్షిణ అమెరికాలో పూరూసు నదివద్దన తెలుపు నలుపు మచ్చలుగల మనుష్యులు ఉన్నారు. కొంతమంది లోతులేని మడుగులలో కర్రలతో కట్టబడిన తేలుతూండే ఇళ్లలోను, కొంతమంది ఒడ్డునా నివసిస్తారు. బార్బడాసు జిల్లాలలోకూడా రంగు రంగుల మచ్చలుగల మనుష్యులున్నారు.

# నేను మంచి పెళ్లాన్నేనా?

మీలో ఎవరిమట్టుకు వారీప్రశ్న ఎప్పుడైనా వేసుకొన్నారా? ఏమైనాకానీ ఉత్తమమైనభార్య ఏవిధముగా సంచరించాలో నా అభిప్రాయాలను నేను వ్రాస్తున్నాను. మీరు నాతో ఏకీభవించినా, ఏకీభవించకపోయినా నాఉద్దేశాలను చదివినంతమాత్రాన మీకు ఇబ్బంది ఉండదని నేననుకుంటాను. లోకాన్ని గురించి పురుషుని భావాలు స్త్రీభావాలు వేరువేరుగా ఉంటాయి.

అందరివలెనే నేనూ పెండ్లిచేసుకున్నాను. ప్రస్తుతం నేను చూస్తూఉండే భార్యల లోపాలనుమాత్రం నేను అనుసరించకుండా ఉండేటందుకున్నూ, దాంపత్యము అనుకూలంగా ఉండేటందుకున్నూ, ఉత్తమగృహిణి కేయేధర్మాలుండాలో నిరంతరం ఆలోచిస్తూనే ఉండేదాన్ని. నాఉద్దేశాలను ఎంతవరకు నెరవేర్చుకున్నానో నేనిప్పుడెటువంటి భార్యనో ఇది చదివేవాళ్లకే స్పష్టమవుతుంది.

సర్వసాధారణముగా మనము మంచి యిల్లాలుఅని గృహనిర్వహణం బాగాచేసుకుంటూ, పిల్లలను బాగాపెంచుకుంటూ లోకానుభవముగల ఆమెను అంటూంటాము. కాని దానిలో ఆమె మంచితనమూ, గొప్పతనమూ నాకేమీ కనబడుటలేదు. కారణమేమంటారా ఇల్లు చక్కపెట్టుకొని పిల్లలను జాగ్రత్తగాపెంచుకోనిదీ పెళ్లి చేసుకోనే చేసుకోదు.

పిల్లలను పెంచడానికి బాగాధనవంతులు నౌకర్లను నియమించుకుంటారు. ఎంతంత డబ్బు ఖర్చుచేసి నౌకర్లను నియమించినా తల్లిపెంచినట్లు దాసీలు పెంచుతారా? కన్నతల్లికి ఉండే సహజమైనప్రేమ దాసీలకు ఉంటుందా? తల్లిచేత పెంచబడిన బిడ్డలకు దాసీచేత పెంచబడినబిడ్డలకు తేడాకనిపిస్తూనే ఉంటుంది. పోనియ్యండి అసలు విషయంలోకి వద్దాము.

భర్త ఇంటికివచ్చేటప్పటికి చక్కగా కలకలలాడుతూ అతనికానందం పుట్టేటట్టు ఎదురువెడతాను. బయట ఎంత కష్టపడివచ్చినా నన్నుచూసేటప్పటికాయన అవన్ని మరచిపోతారు. కొంతమంది ఈ విధంగా కాకుండా భర్తవచ్చేసరికి ఏదో ఒకమూలఉండి ఆయన ఆవాహన, విసర్జన లేకుండా దిష్టిపిడతలాగ ఉంటారు. వాళ్లు యింటిపనులు చేయుటకు నియమించిన మిషనులలాగ నాకు కనుపిస్తారు. భర్తకు భార్యయందు స్నేహభావము, నూతన వికాసము కనిపించనిదే ఉత్సాహము నశిస్తుంది.

నాభర్త అలవాట్లనీ,ఉద్దేశాలనీ చక్కగా పరిశీలించి వానికి తగునట్లు నేనుసంచరిస్తాను. ఎప్పుడైనా కోపముతో భర్త నన్నేమైనా అన్నప్పుడు వెంటనే సమాధానము చెప్పక ఆయనకోపము తగ్గినతర్వాత ఆసంగతి తమాషాగా నవ్వుతూ ప్రస్తావిస్తాను.

నాభర్తతో నేనెప్పుడూ న్యాయముగా నిష్కపటముగా సంచరించుతూ ఉంటాను. నేనాయినను నమ్ముతాను. అందుచేత ఆయన నన్ను నమ్ముతారు.

ప్రదిదినము నాచర్యలనుబట్టి ప్రవర్తనా బలముగల దానివలె నాభర్తకు కనుపిస్తాను. కాని నా భర్త నడవడినిగూర్చి నేను ప్రశ్నించను. ఆయన నడవడి నామీదనే ఆధారపడునని నాకు తెలుసును. ఎందువలన అంటే నాప్రవర్తన, నేచేయుకృత్యములు, నా భర్తకు తృప్తిగా ఉండినయెడల ఇతరప్రపంచములో ఆయనకు సంబంధము ఉండదని నేను నమ్ముతాను. నిజంకూడా అంతే.

నాభర్తలో ఏవైనాదోషాలు కనిపించి నట్లైతే వాటి నివారణకోసం ఆయన కులాసాగాఉన్నసమయాలలో వాటి కష్టసుఖాలు చెప్పి ఒప్పిస్తాను. అంతేగాని మీదితప్పు అని తగవులాడను. అనేకవిషయాల్లో నాకు తోచిన సలహాలకూడ ఇస్తూఉంటాను.

నాభర్త మామూలువేళకుమించి ఆలస్యముగావస్తే ఆయనకోసము తల్లడిల్లిపోతాను ఏమి అపాయమువచ్చిందోఅని. రానురాను అంత అనురాగంలోకదిగింది మాదాంపత్యం. భార్యలు భర్తలకోసం ఆతృతగా వేచి ఉండటం కొంతమందికి పురుషులకు ఇష్టంఉండదు. అందుచేత నేను ఈ విషయముమాత్రము నాభర్తకు తెలియపరచను. ఆయన వచ్చేవరకు ఏవో నాకు తోచిన సులువైన గృహపరిశ్రమలు అంటే పళ్లపొడి, తలనూనెలు, సబ్బులు మొదలైనవి తయారుచేసుకొని సాధ్యమైనంతవరకు ధనము వృధాగా వ్యయపరచకుండా ఉండే సాధనాలు ఆలోచిస్తూఉంటాను.

నాకు ఎప్పుడూ అవి, ఇవి కావాలాలని నిర్బంధపెట్టను. మగవాళ్లు ఇటువంటి భార్యలనే కోరతారని నేననుకుంటాను. గట్టిగా పట్టుపట్టితే అవినాకు వస్తాయని తెలిసిఉన్నప్పటికీ ఆవిధంగా నేను చేయను. అట్లాచేస్తే నాకు తృప్తిఉండదు.

విలాసజీవనంఅంటే నాకు మొదటినుంచీ తలనొప్పి. శీల సౌందర్యం ఉండాలికాని వేషాలు, అలంకారాలతో సౌందర్యం రాదనేవాళ్లలో నేనొకతెను. నా భర్తకు కూడ అదేయిష్టము. చాలమంది అలంకారాలకోసం భర్తలను పీడించి ఆదాయానికి మించిన వ్యయంచేస్తూ నానాబాధ పడుతూంటారు. వాళ్లనిచూస్తే నాకు చాల విచారమవుతూఉంటుంది.

సంతోషమైన విషయాలవుతేనేకాని వెనుకటిసంగతులేవియు తలపెట్టను. ముందు విషయాలకే జాగ్రత్తపడుతూఉంటాను.

అతని వెనుకటి చరిత్రనుగూర్చి నేను అనుమానముతో ఉండను. అనేక దోషాలుండవచ్చును. అయినను వాటివల్ల ఆయనకు తగిన అనుభవము గలిగియుండునని నానమ్మకము. అట్టి అనుభవమే భావిజీవితంలో మిక్కిలి ఉపయోగపడుతుంది.

నాతో ఆకథలు, ఈకథలు, ఇతర సమాచారాలు చెపుతూఉంటే విసుగు ఉన్నట్లు కనిపించకుండా నేను వింటూ ఉంటాను. ఈవిధంగా చెప్పడం నాభర్తకు సరదా. ఆయనఉద్దేశాలకు వ్యతిరేకంఏమీ చెప్పను నేను. అంతాయెందుకు చంద్రమండలంలోకి ఎగరాలనిఉందని నాభర్తఅంటే

అల్లాగే ఎగురుదామంటానేగాని అదేమి విరుద్ధంఅని అనను. దానా దీనా ఇప్పుడు మేము ఉభయులము ఒకరినివిడచి ఒకరము ఉండలేము సరిగదా మాకంటె ఎక్కువ సుఖించే దంపతులు లేరని మేమనుకుంటాము. ఇదంతా చేస్తూ నేను గృహనిర్వాహణంలో ఏమీ లోపం తీసుకొనిరాను సుమండీ!

స్త్రీజాతి దేశానికి వెన్నెముకలాంటిదని భావింపబడుతూవుంది. స్త్రీ దేశసౌభాగ్యానికెంత ఉపయోగపడుతుందో నేను చెప్పడానికి శక్యంకాదు. అట్టివిషయంలో స్త్రీలు తెలివితక్కువ చిక్కులలోపడి మునిగి తేలుతూఉండడం నాకు చాలబాధ గలుగుతూఉంటుంది.

ఇపుడు నేను మంచిభార్యనేనా?

ఇంతకూ చెప్పొచ్చే మాటేమిటంటే మీరు కూడా నన్ను అనుసరించి అపుడు మీ దాంపత్యం ఎట్లాఉంటుందో చూడండి.

(జి. పెట్కిన్)

# గృహాలక్ష్మి చిత్ర ప్రశ్న

గత సంచికయందు ప్రకటింపబడిన చిత్రప్రశ్నకు సరియగు సమాధానము రానందున సోదరీమణులకు మరొక యవకాశ మొసంగుచున్నాము.

ఈ కూపనునందు హిందూదేశమున ముఖ్యమైన పట్టణముల మొదటి యక్షరములు విడువబడినవి. వానిని పూర్తిచేసి మా కార్యాలయమునకు జూన్ 15-వ తేదిలోపల పంపుకొనవలయును. మావద్ద భద్రపరుపబడియున్న సమాధానముతో సరిపోవుదానిని పంపినవారికి ఒక సంవత్సరము గృహాలక్ష్మి సంచిక ఉచితముగా పంపపడును. స్త్రీలుమాత్ర మిందు పాల్గొననగును.




సమాధానములందు విడువబడిన మొదటి యక్షరముతోచేరి సున్నలుండవచ్చును. ఒకరొక రెన్నైన సమాధానములు పంపుకొనవచ్చును. కాని అవన్నియు గృహాలక్ష్మి కూపనులందే యుండవలయును. ప్రవేశరుసుమేమియు లేదు. ఫలితములు జూలై నెల సంచికయందు ప్రకటింపబడును.

గమనింపు: చాలమంది సమాధానములను గృహాలక్ష్మి కూపనులందుగాక వేరుగా పంపుచున్నారు. అవి ఎంతమాత్రము అంగీకరింపబడవని మనవి.




## శాస్త్రి హోటలు అనగానేమి?

ఆరోగ్యభాగ్యమునిచ్చు ఆహారములకు
అల్పాహారములకు పుట్టినిల్లు.

వీర్యబలమునిచ్చు మధురపదార్థములు, చలిదేశ
మునకు అనుకూలమైన శయ్యాగృహములు,
దంపతులకు తగిన యేర్పాటులు.

## శాస్త్రి హోటలు

89 చిక్ పేట — బెంగుళూరు సిటీ.

# పుష్పచయము

## రాజుగారి పట్టాభిషేకము

మేనెల 12 వ తేదీన లండనులో జార్జిసార్వభౌముని పట్టాభిషేకము జరిగెను. ఇంగ్లాండు దేశచరిత్రలో లండను నగరమం దంతటి గొప్ప జనసమూహ సమావేశ మెప్పుడును జరిగియుండలేదని తెలియుచున్నది. తావు దొఱకదని ఒకదినముముందుగనే పలు దేశముల నుండి జనులువచ్చి రాజబాట కిరుప్రక్కల ముందుగా స్థానము లేర్పరచుకొని నిద్రాహారములకు లక్ష్యపెట్టక వేచియుండిరి. బాటలవెంట సద్దుచుటకు 20 వేల పోలీసులు బారులు తీర్చి నిలువబడిరి. ఆజనసమర్దములో నలిగి అపాయము సంభవించినవారిని వెంటనే గొనిపోయి చికిత్స చేయుటకు అంబ్యులెన్సు సేవాసంఘమువారు అచటచట వేచియుండిరి.

ఉదయము 7-15 గంటలకు రాణిగారి ప్రియసఖియగు స్కాట్లండు దేశస్థురాలు కాథరినువచ్చి రాణిగారిని నిద్రమేల్కొల్పెను. ఉదయమగుసరికి బయటచేరియున్న జనసమూహములో పురుషులసంఖ్యకన్న స్త్రీలసంఖ్యయే యెక్కువగనుండెను. ఒక పురుషునకు పదిమంది స్త్రీలవంతునగలరు. వారిదుస్తులన్నియు బ్రిటిషుజాతీయ పతాకవర్ణములతో నుండెను.

వెస్టుమినిస్టరు అబేలో పట్టాభిషేక మహోత్సవము జరిగెను. అచట నతివైభవముగ పలురంగుల విద్యుద్దీపములు వెలుగుచుండెను. పట్టాభిషేకమహోత్సవమునకై ఆహ్వానింపబడిన ప్రముఖులందరును తండోపతండములుగా వచ్చుచుండిరి. ఊరేగింపు బకింగుహాము రాజభవనమువద్ద ప్రారంభమగుచున్నది. రాజదంపతులచట చైనాగదిలో ప్రాతఃకాల భోజనమారగించిరి. రాజబంధువులుగూడ వేర్వేరుగదులలో భోజనము చేసి సిద్ధమైరి. భారతీయయోధులపటాలములు ఇంద్రధనుస్సు రంగులుగల వింతదుస్తులనుధరించి బారులుదీర్చియుండిరి. రాజదంపతుల యూరేగింపు 8 గం. 40 నిముషములకు ప్రారంభమయ్యెను. ముందు కెనడాదేశపు అశ్వికదళము వచ్చినిలచెను. పిదప జరీపాగాలుగల భారతీయయోధదళము శూలముల చేపట్టినిలచెను. వారివెనుక దక్షిణాఫ్రికాపటాలము ఆకుపచ్చని యెడుపములతో వచ్చెను. తర్వాత ఆస్ట్రేలియనులు, న్యూజీలాండుదళములు, రాయలుపోలీసుదళములు నిలువబడెను. అబేఆలయముప్రక్కనున్న వీధులలో ఫైరు ఇంజను లుంచబడెను. ప్రధానమంత్రి బాల్డ్విను బయలుదేరగానే ప్రజలు హర్షధ్వనులుచేసిరి. రాజుగారి కుమార్తెలగు ఎలిజబత్తు, మార్గరెటురోజను రెండు అద్దాలబండ్లలో కూర్చుండిరి. పిమ్మట మేరీరాణిగారి బండిగలదు. రాజదంపతులబండి బయలువెడలునప్పుడు పెద్ద విద్యుద్ఘంట ధ్వనించెను. బ్యాండుమేళము మ్రోగెను. ప్రజలు జయజయధ్వనులు చేసిరి. రాజుగారు ఎర్రని ముఖమలు దుస్తులను ధరించిరి. రాణిగారు టోపీ ధరించలేదు. వెస్టుమినిస్టరుభవనము 10-59 గంటలకు చేరిరి. దివ్యమైన దుస్తులుధరించి బిషప్పులు రాజదంపతుల ఎడమవైపున నిలువబడిరి.

అంతట రాజుగారికి రాజలాంఛనములైన ఎర్రని ముఖమలు అంగీలనుతొడగిరి. ఖడ్గమును కరగోళమును చేతబట్టిరి. రాజదండమును మరొకచేతబట్టిరి. మొహరుఉంగరమును వ్రేలికిగట్టిరి. అప్పటికి మధ్యాహ్నము 12-31 నిముషములయ్యెను. అందరును లేచినిలువబడగా ఆర్చిబిషపు ఆఫ్ కాంటరుబరీ కిరీటమును పైకెత్తి

రాజుగారి శిరస్సుపై మెల్లగానుంచెను. హాలంతయు జయజయధ్వనులతో నిండిపోయెను. సెంటుజేమ్సు పార్కునుండియు లండనుపుర గోపురమునుండియు ఫిరంగులు మ్రోగెను. ఆ దేవాలయమున గంటలు మ్రోగెను.

పట్టాభిషేకము ముగియగనే అందరును రాజుగారికి జోహారు చేసిరి. ఆర్చిబిషపుగారి యాశీర్వాదనమైన పిమ్మట రాజుగారు సింహాసనమధిష్ఠించిరి. అందరికన్న ముందుగ ఆర్చిబిషపుగారు రాజుగారిని దర్శించి నమస్కరించి వారిఎడమబుగ్గను ముద్దుపెట్టుకొనిరి. వారితర్వాత రాజుగారిసోదరులగు గ్లస్టరు కెంటు ప్రభువులు జోహారుచేసిరి.

అంతట రాణీగారుకూడ పూజానివేదికను సమీపించెను. ఆమెకుగూడ పట్టాభిషేక తంత్రవిధానము జరుపబడెనుగాని రాజుగారికిజరిగినంత నామెకు జరుగలేదు. ఆమె కిరీటముధరించినపిమ్మట రాకుమార్తెలును ప్రభ్వీణులును తమ మకుటములధరించిరి. పిమ్మట రాణీగారు పూజా వేదికనుండి తనసింహాసన మధిష్ఠించుటకై వచ్చునపుడు రాజుగారికి తలవొంచి సింహాసనమెక్కెను.

అంతటితో పట్టాభిషేకమహోత్సవము సమాప్తినగుచుండెను. భగవత్ప్రార్థన ముగిసినవెనుక రాజుగారు కిరీటధారులై కరగోళమును చేతబట్టి రాజదండమునుధరించి కిరీటధారిణియైన రాణీతో పశ్చిమద్వారము కడకు జనిరి. రాజదంపతులాలయము ప్రవేశించునప్పటికంటె వెడలునప్పుడు దృశ్య మతిరమ్యముగా నుండెను.

* * * *

## 60 ఏండ్లముసలి ఆడుకొనుఅమ్మాయి అయినది

డాక్టరు బెవర్లీగారు వర్జీనియా మెడికల్ మాసపత్రికలో ఇట్లు తెలుపుచున్నారు:—

ఈ స్త్రీ రిచ్‌మండు నగరనివాసి. ఈమెకు యుక్తవయసున వివాహమయ్యెను. ఈమెకు ముగ్గురుపిల్లలు కలిగినతర్వాత భర్తచనిపోయెను.

ఇంతలో ఆమెయం దద్భుతమైనమార్పు కనబడెను. ముడుతలుపడినచర్మము ప్రౌఢశరీరమువలె తయారయ్యెను. రానురాను యామెమాటలలోను ధోరణిలోను, రుచులలోను ననేకమార్పులు గలుగుచువచ్చెను. పొడుగైనగౌనులుమాని మోకాలు దిగీదిగని గౌనులకును, యౌవనస్త్రీ లుపయోగించు తదితర వేషములకును ప్రాకులాడుచుండెడిది. తల్లిలోని యీవింతమార్పుజూచి యామెపిల్లలు ఆశ్చర్యపడి వెంటనే డాక్టరు టక్కర్ చికిత్సాలయములో చేర్పించిరి.

హాస్పిటలులో చేరునప్పటికామెకు అరువదియొక్క సంవత్సరముల వయస్సువచ్చెను. అప్పటి కామె ఏడేండ్లపిల్ల చేయుచేష్టలు చేయుచు ఉయ్యాలలో ఊగుచు ఉండెడిది. పుస్తకములు తెడుముకొనుచు చదువుచుండెడిది.

తర్వాత కొంతకాలమునకు బాల్యావస్థ ప్రారంభమయ్యెను. మొదట గంతులువేయుచు పరుగులెత్తెడిది. పిమ్మట మరీవింతగా మారిపోయెను. గంతులువేయుటమాని ప్రాకుట మొదలుపెట్టెను. పుస్తకములోని అక్షరములుగూడ గుర్తించుటలేదు. పసిపిల్లలవలె 'అమ్మా, అమ్మా' అని అరచుట ప్రారంభించెను. ఉయ్యాలలోపడుకొని కాళ్లుచేతులు ఆడించుచుండెను. ఆహారముకూడ పసిపిల్లలకిచ్చుఆహారమే త్రాగుచుండెను. ప్రతిదినము జనులు గుంపులుగుంపులుగావచ్చి ఈవింతనుజూచి పోవుచుండిరి. వైద్యులందరును యీమెలోగల మార్పుల కమితముగ నాశ్చర్యముబొందుచు ఎప్పుడును నచటనేయుండి పరిశోధనచేయుచుండిరి. పిదప నామె

శ్వాసకూడ పసిపిల్లలు తీసికొనునట్లుమారి క్షీణింపప్రారంభించెను. ఆసమయమున నామె స్టేటు హాస్పిటలునకు తీసికొనిపోబడెను. ఆరుమాసములచట గడచినపిమ్మట నామె చనిపోయెను.

ఈవింతగొలుపుమార్పునకు కారణము డాక్టరు టక్కరుగా రిట్లభిప్రాయపడుచున్నారు. ఆమెభర్త చనిపోయినపిదప తనపిల్లలను జాగ్రత్తగా పెంచుటకును, వారితో ఆడుకొనుటకు వారి నానందింపచేయుటకును తాను చిన్నదానిగామారుట కెక్కువ ఇష్టపడియుండెడిది. ఆమెమనసునం దెప్పుడును చిన్నదానిగా కావలెనను యభిప్రాయము పెట్టుకొనుటచే నట్లు మారియుండును.

* * * *

## నాలుగుసంవత్సరములబాలుడు రామాయణశ్లోకములు జెప్పును

సాగరులో ఝాన్సీనుండివచ్చిన నొక గ్రుడ్డిబాలుడు రామాయణములోని శ్లోకములు గడగడ నప్ప చెప్పుచుండెను. అతనివయస్సు నాలుగుసంవత్సరములు. ఈబాలునిచూచుటకై జనులు గుంపులుగావచ్చి అమితాశ్చర్యమును బొందుచుండిరి. ఒకదినమున పోలీసుకమీషనరు, సూపరెంటెండెంటు, సివిలుసర్జనువచ్చి ఆబాలునిపరీక్షించి వానిని శ్లోకములు చదువమనిరి. ఏమియు జంకులేకుండ చదివెను.

ఆబాలుడు పసిబిడ్డగా నున్నప్పుడు వానిసోదరుడు వానినితొడపైనిడుకొని ఎప్పుడును రామాయణ శ్లోకములు చదువుచుండుటచే ఈవిధముగవచ్చెనని యాపిల్లవాని తండ్రిచెప్పెను. ఆబాలుడు గ్రుడ్డివాడగుటచే జ్ఞాపకశక్తి హెచ్చుగానుండును. అందువలన వానికాశ్లోకములు పట్టువడినవని డాక్టరు అభిప్రాయపడెను.

* * * *

## మీ 50 ఏండ్ల జీవితానికి ఖర్చు ఎంత ఔతుంది?

కోట్లకొలది ప్రజలు పుట్టుతున్నారు. గిట్టుతున్నారు. కాని తమ జీవితారంభంనుండి జీవితాంతంవరకు తమకెంత యెంతడబ్బు ఖర్చుఅవుతుంది. యెంతకాలం దేనికొరకు వినియోగపడుతూవుంది? అని తెలుసుకొనే వారు, తెలుసుకోవాలని ఆతురపడేవారుగాని లేరు. అవి తెలిసినవారు చాలా కొద్దిమందిమాత్రం వుంటారు. దామాషాను 50 యేండ్లు జీవించేవారి ఖర్చులను వివరాలనుగురించి "హేమచంద్ర నర్సీ" గారు యిలావ్రాశారు.

గర్భం దాల్చినవాటినుండి పుట్టేవరకు రు 100లు. చదువుకు రు 1600లు. జుట్టుకత్తిరింపుకు, క్షురకర్మకు 800. స్నానంచేసేందుకు వుపయోగించే సబ్బులకు 225. తలనూనెలు, పౌడర్లు 600. దోవతులు 250. కోట్లు 500. చొక్కాలకు బదులుగా వుపయోగించే షెహరాన్స్‌కు 250. బనీన్లు జేబుగుడ్డలు వగైరా రు 225లు. చెప్పులు వగైరా 225. చాకలి రు 800లు. తిండి 8000. అద్దె 3600. లైట్లు రు 750లు. ట్రాం. బస్సు వగైరా రు 6225. చిల్లర రు 300లు. టీ రు 2062-9-0. సిగరెట్లు రు 5750 లు. బీడీలు రు 600లు. తమలపాకు బీడాలు రు 562-8-0. పండ్లు రు. 4000లు.

ఇక మనిషి తనజీవితకాలంలో ఎన్నిసార్లు ఎంతనీరు త్రాగుతాడు. ఎన్నిసార్లు ఎంతగాలి పీలుస్తాడు. ఎన్ని మైళ్లు నడుస్తాడో వివరిస్తాను.

మనిషి 90,000 పర్యాయములు నీళ్లు త్రాగుతాడు. త్రాగిన నీటిబరువు 98,000 పౌనులు. 72 000 సార్లు తింటాడు. ఆహారపదార్థాల బరువు 288,000 పౌనులు. 20,000 వేల సార్లు స్నానంచేస్తాడు. ఆ

నీటిబరువు 160,000 పౌనులు. 36000 మైళ్లు నడుస్తాడు. 1,555,200,000 సార్లు గాలి పీలుస్తాడు. పీల్చిన గాలి బరువు 60,750,000 పౌనులు వుంటుంది. 1,440,000 సార్లు కళ్లు ఆర్పుస్తాడు. దానిక్రింద 40,000 గంటలకాలం అంటే 16,666 రోజుల 16 గంటలకాలం వ్యయమవుతుంది. చిన్నతనంలో యెదిగేయెదుగుడు పెద్దఅయిన తరువాతకూడవుంటే మనిషి 196 అంగుళాలు అంటే $16\frac{1}{3}$ అడుగులు పొడుగు పెరుగుతాడు. 330 పౌనులు బరువు తూగుతాడు. 120 అంగుళాలు లేక 10 అడుగులపొడవు గోళ్లువుండాలి. తలవెంట్రుకలు 50 అడుగుల పొడవు పెరగాలి. గడ్డం 144 అంగుళాలు లేక 12 అడుగులు పొడవు పెరగాలి. పాదం 29 అంగుళాలు పొడవువుండగా $2\frac{1}{2}$ అడుగులప్రమాణం చెప్పులయితేగాని దానికి సరిపోవు.

ఇక మానవుని జీవితకాలంలో ఏపనికి ఎన్నిగంటలు వ్యయమవుతూవుంది? అనేవిషయం తెలుసుకోవాలి. స్నానానికి 6000 గంటలు. క్షురకర్మకు 1200 గంటలు. తినడానికి త్రాగడానికి 10000 గంటలు. నిద్ర 4,53,000 గంటలు. చిల్లరపనులకు 17250 గంటలు. అంటే యేమిటి? దామాషాను 50 సంవత్సరాల ఆయుర్దాయంగల మనిషికిగల 438000 గంటలకాలంలో పైనచెప్పబడిన కార్యాలకుగాను 187450 గంటల కాలం వ్యయమైపోతూవుంది. పోతే ఇక మిగిలింది 250,550 గంటలకాలం మాత్రం. ఈకాలం సృష్టికర్త, దేశం, మతం, కుటుంబం, స్నేహితులు, ఆత్మరక్షణలయెడ అతను నిర్వర్తింపవలసిన అవసరకార్యముల నిర్వహణకు సరిపోతుందా?

* * * *

"బోబాబు" వృక్షము

ఆస్ట్రేలియాలో బోబాబు అను నొకజాతివృక్షములు గలవు. వర్షాకాలమున ఆవృక్షముల తొఱ్ఱలలోను కొమ్మలపల్లములలోను పడిన నీరు అట్లే కొన్ని నెలలవరకు చెడకుండనుండును. వేసవికాలమున ప్రయాణీకులకా జలము ఎక్కువ ఉపయోగపడుచున్నది. ఒకవేళ నీరు ఇంకిపోయినను చెట్టుబెరడుతీసి పిండినయెడల శుభ్రమగు తేటనీరు వచ్చును. ఆనీరు ఏమియు వాసనలేక స్వచ్ఛముగనుండి త్రాగుట కుపయోగించును. ఈచెట్టు వేసవిలో అనేక ప్రయాణీకులను రక్షించుచున్నది.

ఈచెట్లలో పల్లముగానుండు ప్రదేశము లెక్కువగలవు. ఒకచెట్టు తొఱ్ఱలో నొకసారి 30 మంది ఖైదీలను కట్టిపడవేసిరి. దానివిబట్టి ఎంతెంత తొఱ్ఱలుండునో యూహింపనగును.

* * * *

దివ్యదృష్టిగల ఎద్దు

బెంగాలీనాథ్ అనువానివద్ద నొకఎద్దుగలదు. అతడు దాని నొకసంతలో కొనెను. ఆయెద్దుకు 'ఎక్సరే' నేత్రములు గలవందురు. అది కోటుజేబులలోను పెట్టెలలోను ఏవస్తువులున్నను తెలుసుకొనగలదు. ఒకడజనుమంది జేబులలో వేర్వేరు వస్తువుల నుంచుకొనియుండగా బెంగాలినాథు దానిని కాగితము ఎవరిజేబులోనున్నది, రూపాయ లెవరిజేబుననున్నది తెలుపుమనగా నది ఆయావస్తువులు గలవారిని తాకును. లేకచిత్రములుకూడ చేయునట. ఎవరివద్ద ఏకార్డు ఉన్నది తెలుపును. ఏభాషను మాట్లాడినను గ్రహించుకొనగలదు. అతడాయెద్దును ప్రదర్శించి ధనము గడించుచున్నాడు. ఆయెద్దు పేరు భోలానాథు. దీని వింతచర్యలకు పరిశోధకు లేమియు చెప్పలేకుండనున్నారు.



:జర్మనియందు 1927 వ సం. తరువాతజన్మించిన బాలికలందరు 'బాలికలసంఘ'మందు సభ్యులుగావలయును. చేరుటకుముందు వారిని వైద్యపరీక్షచేయు టిందు గానవగును.



వసంతకాలమందు హీడెల్ బర్గ్ దృశ్యము

# గ్రంథపరిచయము

## గళ్లచీర

ఇది కథాసంపుటి. ఇందులో 'గళ్లచీర', 'అమ్మమ్మ', 'కాఫీ', 'బాల్యస్నేహం', 'అత్తాకోడళ్లు', 'పెళ్లి చెడగొట్టిన అవధాని' అను ఆరుకథ లున్నవి.

తెలుగు కుటుంబములలో సర్వసాధారణముగా జరుగుచుండు సంఘటనములను ఆధారముగాజేసికొని యీకథలు వ్రాయబడినవి. దీనిపీఠికలో తల్లావఝులవారు 'గార్హస్థ్యజీవితము మనోహరమైనదనీ చమత్కారపూర్ణమైనదనీ ఉత్తమమైనదనీ యీ కథకునిఅభిప్రాయ'మని వ్రాశారు. ఇది 'బాల్యస్నేహం' 'అత్తాకోడళ్లు' అను కథలకు వర్తించునటుల గనపడదు. 'పెళ్లి చెడగొట్టిన అవధాని'లో ఇతరకథలలోని మృదుత్వము, పవిత్రాశయములు దూరమైనవి.

మొదటి మూడుకథలు కుటుంబజీవితమందలి మాధుర్యమును ప్రస్ఫుటము చేయుచున్నవి. 'బాల్యస్నేహితం' 'అత్తాకోడళ్లు' కుటుంబములు నికృష్టభావములచే పడుపాట్లు జూపుచున్నవి.

కథ లందరు చదువతగినవే. రచన సరళమై వ్యావహారిక భాషయందు చక్కగ సాగినది. సంభాషణలు రసవంతములై చమత్కారముగ నున్నవి. గ్రంథకర్తగారగు పురాణం కుమారరాఘవ శాస్త్రిగారిట్టి వింకను వ్రాయుదురుగాక.

ఇది నవ్యసాహిత్యపరిషత్తు, గుంటూరువారిచే ప్రకటింపబడినది. వెల అర్థరూపాయి.

* * * *

## దయ్యాలు

ఇందు దయ్యములనుగూర్చిన పండ్రెండుకథలు గలవు. శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మగారు రచించిరి. సరస్వతీగ్రంథమండలి 24-వ అనుబంధమాలికగా ప్రచురింపబడినది.

ఆంధ్రదేశములో అనుశ్రుతముగా చెప్పకొనుచున్నకథలనే రచయిత్రిగారు విని రెయ్యి చోచేర్చి చదువుట కింపుగానుండునట్లు చక్కని సంభాషణలతో కూడ రచించిరి.

ఈకథ లన్నిటియందును సంఘదురాచారములకు బలిగాైన ప్రాణులే బ్రహ్మరాక్షసులు, పిశాచములు, దయ్యములుగామారి సంఘమున కంతులేని యుపకారముజేయునను యర్థము ధ్వనించుచున్నది. దయ్యముల మాట దైవమెఱుగునుగాని, అనుశ్రుతముగా జెప్పకునే ఈకథలలోకూడ మనవారు సంఘదురాచారముల కూడదని బోధించుట స్పష్టము. వెల 0–12–0.

* * * *

## ఆత్మకథ (తొలిపాలు)

వేలూరి శివరామశాస్త్రిగారు రచించిన మహాత్ముని ఆత్మకథ వచనకావ్యము నాధారముగాగొని తుమ్మల సీతారామమూర్తిచౌదరిగారు దీనిని పద్యములందు రసవంతముగ రచించిరి. ఈ గ్రంథప్రాశస్త్యమును

గూర్చి తెనుగుగుడి తొలికోలువరియగు మాకేపల్లి రామచంద్రశాస్త్రిగారు తొలిపలుకునందు వివరముగ వ్రాసిరి.

చౌదరిగారు 'తిక్కయజ్వలు త్రొక్కిన త్రోవకు సమ్మతిపడి తెలుగుకవిత్వమునందు దియ్యదనము సంపాదించి 'సరసులెల్ల మెచ్చ మెఱయింతు కవితలో, కమ్మదనము మక్కళమ్మనవలె' అను ప్రతినతో దీనిని ప్రారంభించిరి. 'ఎల్లరు గద్యమేచదువ నిచ్చవహింపరు, పద్యమన్న సంధిల్లును వేడ్క పెక్కురకు' అని వచనమందలి ఆత్మకథను గద్యాత్మకముగ వ్రాయ బూనుకొనిరి.

వీరు కైకొన్నది మహాత్మునికథ. దాని ప్రాముఖ్యముంగూర్చి వేరుగ వ్రాయ నవసరము. తనచరిత్రయందు సాధారణులు నేర్చుకొనవలసిన విషయములు పెక్కులుగలవనియే మహాత్ముడద్దానిని ప్రకటించెను.

తాముపట్టిన ప్రతినప్రకారము చౌదరిగారు చవులూరించు పద్యములచే పొత్తమంతయు నింపియున్నారు. వీరిరచనయందంతయు తెనుగునుడులు సామెతలు నుడికారము పెక్కువ. పలుకుపొందిక బాగు. పొత్తమును జూచినవారందరందలి తెనుగుందనము గుర్తింపకపోరు.

గ్రంథకర్తగారు మిగిలినపాళ్లుకూడ నీరీతి వెలువరించి తెనుగుతల్లిని కైసేయుదురుగాక. తొలిపాలు వెల 1 రూపాయి. ప్రతులు వలయువారు ఉభయభాషాప్రవీణ తుమ్మల సీతారామచౌదరిగారు, తెలుగు పండితులు, బోర్డుహైస్కూలు, బాపట్లకు వ్రాయగలరు.

* * * *

## టాల్‌స్టాయి కథలు

టాల్‌స్టాయి ప్రపంచఖ్యాతిగన్న రష్యాకథకుడు; కవి. తాను శ్రీమంతుడయ్యు శ్రీమంతులు మదాంధులై బీదలను బెట్టుబాధలు వారి దీనస్థితినిగమనించి తన జీవితమంతయు వారియున్నతికై పాటుబడవలయునని ప్రయత్నించిన మహోన్నతహృదయుడు. తన రచనలచే సంఘమునం దలజడిగలిగించి ధనవంతులు బీదవారను భేదము పరమాత్మునిహృదయమును గుర్తెఱుగని వారికిగాని సృష్టికర్తకుగాదని ప్రపంచమునకు చాటెను. ఈతని రచనలు ప్రపంచమందలి యన్నిభాషలలోనికిని పరివర్తన మొనరింపబడి భేదములు రూపుమాపి మానవులందరిని నానాటికి దగ్గర జేర్చుచున్నవి.

ఈపుస్తకమున 'జీవనమూలకందము', 'జల్లుథక్క', 'దయయే దైవము' అను మూడు టాల్‌స్టాయి కథలు గలవు. 'జల్లుథక్క'యందుదప్ప వీనియందు టాల్‌స్టాయి ఆశయములు స్పష్టముగ వెల్లడింపబడినవి. అనువాదకులైన హొసూరు నంజుండరావుగారు మూలకథలయందలి భావము స్పష్టముగునీతి సరళమగుశైలిలో రచించినారు. ఇట్టికథల నింకను నాంధ్రములోనికి దీసికొనిరావలసిన యావశ్యకతనుగుర్తించి గ్రంథకర్తగారా కర్తవ్యమును నెరవేర్తురుగాక. వెల 0-8-0 ప్రతులు గ్రంథకర్తగారివద్ద 12, ఈస్టురోడ్డు, బసవనగుడిపోస్టు, బెంగుళూరునందు దొరకును.

* * * *

## శ్రీ మహర్షి

ఆంగ్లమునందు ఎం. ఎస్. కామత్ గారు రచించిన పుస్తకము కిది కం. నరసింహరావుగారి యనువాదము. భారతీయుల యాధ్యాత్మికౌన్నత్యమునకు నిదర్శనమై నేడు ప్రపంచమందంతటను గౌరవింపబడు

చున్న శ్రీ రమణమహర్షి జీవితమీగ్రంథమున క్లుప్తముగగలదు. వారిజీవితమందలి విశేషములన్నియు యాధ్యాత్మికచింతలే యగుటవలన బాల్యకాలమునుండియు వానికే ప్రాముఖ్యమివ్వబడినది. శ్రీరమణమహర్షినిగూర్చి యెఱుంగగోరువారికిది యమూల్యగ్రంథము. క్రౌను 1-8 సైజున దళసరి గ్లేజుకాగితములపై ముద్రింపబడినది. శ్రీవారి జీవితచరిత్ర యందలి వివిధవిషయములకు సంబంధించిన 112 ఛాయాచిత్రములుకూడ పొందుపరుప బడినవి. వెల 0-8-0 ప్రతులు, శ్రీ నిరంజనస్వామి, సర్వాధికారి, శ్రీరమణాశ్రమము, తిరువణ్ణామలలో దొరుకును.

* * * *

## 'ఆంధ్రపత్రిక' ఈశ్వర సంవత్సరాది సంచిక

ఆంధ్రపత్రిక కార్యాలయమునుండి యిరువదిఎనిమిదవ ఉగాదిసంచిక సర్వాంగశోభితముగా వెలువడినది. దక్షిణభారతదేశమున వెలువడు పత్రికలందు వార్షికసంచికలం దిట్టిది దుర్లభము. వ్యయప్రయాసల కోర్చి నిట్టి యనుపమానసంచిక ప్రతిసంవత్సరమును ప్రకటించు శ్రీయుత కాశీనాథ నాగేశ్వరరావుగారు శ్లాఘనీయులు.

ముందుసంచికలందువలెనే యిందు పలువురు ప్రముఖుల పద్యగద్యరచనలగలవు. అవి పెక్కువిషయములకు సంబంధించినవై పాఠకుల విజ్ఞానాభివృద్ధికి మార్గదర్శకములై యున్నవి.

ఇందు మల్లంపల్లి సోమశేఖరరావుగారు రచించిన 'వార్తాపత్రికలు' పాఠకలోకమునకేగాక పత్రికలకు కూడ పెక్కుడుపయోగకరములగు విషయముల దెలుపుచున్నది.

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారి 'భావము' గంభీరభావబంధురమై సారస్వతమునకు మణిప్రాయముగనున్నది. గురుసంభీరవిషయములనుగూడ తేటతెల్లముగ దెలుపుచు అనుకరణ, అనుసరణ, అపహరణములే నవీనసారస్వతాభివృద్ధికి సాధనములని దలంచుట పొరపాటనుచున్నది.

సోమయాజులవారి 'శ్రీనాథుని జన్మస్థానము' పరిశోధకులచేతులలో నెన్నిపరివర్తనములుబొంది కొండవీడుప్రాంతములకు చేరుకున్నదో తెలుపుచున్నవి.

వెంపటి నాగభూషణముగారి 'సేప్టిరేజరు' పురాణకథలను ఆధునికదృష్టితో చూచుటకు నిదర్శనము కావచ్చునేమో? మరేభావము గనపడదు.

'పునస్త్రీ పునర్వివాహము' సంఘములోని దురాచారములకు తిరుగుబాటు.

ఇంకను నూతనవిషయముల దెలుపు చరిత్రాత్మకవ్యాసములు రసవంతమగు పద్యరచనలునున్నవి.

త్రివర్ణ, రేఖా, ఛాయాచిత్రములు మిక్కుటముగ గలవు.

ఈసంచిక ముద్రణావిషయమున నింకను శ్రద్ధజూపియుండినచో నెంతోరమ్యముగ నుండెడిది. ఈలోపము అనివార్యము గాకుండుగాత.

[ప్రకటనలు చిత్రపటములు కొన్నిచో వ్యాసములమధ్య పెక్కువగాతేరి చదువరులకు విసుగు గలిగించునటులున్నవి. ఈపద్ధతిమారిన బాగుండునేమో]



# మీ రెండు చర్మములను సుందర తమముగా జేసికొనుడు

లల్లనిచుక్కలు, గీరలు, ముడుతలు క్రిందిచర్మమున మైలుచేరినపుడే పైచర్మమున గరకుతనము ప్రారంభించును. త్వరలోనే క్రిందిచర్మమునగల తైలగ్రంథులు నశించును. కావుననే నల్లనిమచ్చలు పుట్టును. అపుడు క్రిందిచర్మము క్రుంగిపోయి ముడుతలు గీరలు ఏర్పడును. సౌందర్యముకొరకై యీ రెండుచర్మములను వేరువేరుగా శ్రద్ధవహింపుము.

నల్లనిమచ్చలు గీరలు, ముడుతలు: ప్రతిరాత్రి పాండ్స్ కోల్డుక్రీమ్ పూయుచున్నచో, క్రిందిచర్మపు తైలగ్రంథులను మరల ఆరోగ్యవంతముగ జేసి సౌందర్యము గాపాడును.

గరకు చర్మము కూడ మాయును. ప్రతిరాత్రి పాండ్స్ కోల్డుక్రీము వెంట పాండ్స్ వానిషింగ్ క్రీమ్ ముఖమునకు, మెడకు, చేతులకుపూసిన మరుదినముదయమున చర్మము మృదువుగా మనోహరముగానుండును.

ఉచితము: దీనిని నేడే పంపి పాండ్సు రెండు క్రీములట్యూబులను పాండ్సు ఫేసుపౌడరు మాదిరులను ఉచితముగా బడయుడు. (చెక్ షేడు) నేచురల్ ... ..........రోజ్ క్రీమ్..........బ్రునెట్..........

డాడ్జి అండ్ సెయ్‌మర్ లిమిటెడ్,
3, విటెట్ రోడ్డు, బొంబాయి.

పేరు........................................

చిరునామా..................... No. GL. 15.

# 200000 మలేరియా మరణములు

ప్రతియేటను మలేరియావల్ల మనదేశములో యిరవైలక్షలమంది మరణిస్తున్నారు. ఆ మరణములు సాధారణమైనవికావు హృదయకుహరాలనుండి కదల్చివేసే చలి, శరీరాన్ని క్షేల్చివేసే ఉష్ణము, శిరాన్ని పగులగొట్టే తలనొప్పి, కాలుచేతులను నమలుకొని తినివేసే నొప్పులు, పీకులు వీటితో యమయాతనను అనుభవించినమీద వచ్చిన మరణములు. ఇంతటి దారుణమునకు కారణము మలేరియా. మలేరియాను పూర్తిగా మాన్పుటకు మందు లేదనే పిచ్చినమ్మకము దేశములో వ్యాపించినది. అందుకు గుణమీయలేని యెన్నోమందులే కారణము.

మలేరియాను పూర్తిగా సంహరింపగలశక్తి "అర్క వద్ద" వుంది. "అర్క" ప్రయోగము తిరుగులేని చక్రాయుధప్రయోగమె. ఎంతటి తీవ్రమైన జ్వరాలనన్నను పారద్రోలుటలో "అర్క"తో పోల్చదగినది మరియొకటిలేదు.

## అర్క

జ్వరములపాలిట చక్రాయుధము




## సార్వభౌముల పట్టాభిషేకము

మాసములనుండియు నేర్పాటులగావింపబడినవి; లక్షలకొలది ధనము వెచ్చింపబడినది; ఖండఖండాంతరములనుండి రాకపోకలు జరిగినవి; ప్రపంచమందంతయు పత్రికలందు నీవార్తలే మారుమ్రోగినవి; ఇవన్నియు ఆరవజార్జి సార్వభౌముల పట్టాభిషేక మహోత్సవమునకే! ఎంతవైభవముగ నెంత యానందదాయకముగ, నెంత వినోదముగ, నెంత విరివిగ నీమహోత్సవము జరుపవలయునని ప్రజలు, ప్రభుత్వముగలసి ప్రయత్నించిరో యంతకంటె యధికముగ నద్వితీయముగనే జరిగినది. ఆరవజార్జి సార్వభౌములును ఎలిజబెత్ రాణిగారును సాంప్రదాయానుసారముగ వెస్టమినిస్టరు అబే అను క్రైస్తవదేవాలయమున, మే నెల 12-వ తేది బుధవారము మధ్యాహ్నము 12 గం. 31 నిముషములకు శాస్త్రోక్తముగ కిరీటధారణము వహించిరి.

ప్రపంచమంతయు యుద్ధవాతావరణముచే కంపించుచున్నది. ప్రతి దేశము మారణయంత్ర సామగ్రిని సేకరించుటలో నిమగ్నమై యున్నది. ప్రతిమానవుడును భావికాల మెటులుండునో యని కలత నొందుచున్నాడు. అటులుండ లండను నగరమున జరిగిన యీ పట్టాభిషేకమునకు భూగోళమునం దన్ని ప్రదేశములనుండి, యన్ని యంతస్థులవారును, వివిధ విజ్ఞాన వియత్తలమున వెలయు తారకాగణమును, వేలకొలదిమైళ్లు పయనించి, తమకు గాని తమ దేశమునకు గాని జాతీయతకు గాని సంబంధించినదిగాదని యెంచక, తమ మధ్య గల భిన్నాభిప్రాయములను, వైషమ్యములను మరుగుపరచి, ఇది సర్వమానవ మహోత్సవమనిదలంచి పాల్గొని యానందించుట ముదావహమే. శాంతిచూపుమేర దూరమునలేని నీదినములలో సర్వజనీనమైన యీ జార్జి సార్వభౌముల పట్టాభిషేకము వారి పాలనకాలమున ప్రపంచ శాంతి నెలకొల్పుటకు వారుచేయు ప్రథమ ప్రయత్నమని యూహింతము.

ఇతర దేశీయులతో పాటు భారతీయులు గూడ పట్టాభిషేకమున పాల్గొనిరని చెప్పుటకు వీలులేదు. స్వాతంత్ర్యదీప్తులచే వెలుంగుచున్న విదేశములతో పాటు పారతంత్ర్యముచే ముఖమువాడి సంతోషవిహీనమై, సమానప్రతిపత్తిలేక సౌఖ్యదూరమైయున్న భారతదేశము పారతంత్ర్యమను మాటలేక యుండినచో నితరులకంటె బ్రిటిషు సార్వ

భౌముల పట్టాభిషేకమునెడ నెక్కువ గౌరవాదరణములే గాక అమితోత్సాహ సంతోషములను జూపియుండెడిది.

* * *

బేడన్ పావెల్ గారి నిందలు

'స్థాలీపులాక న్యాయము' అన్నము పాత్రవఱకేగాని తరువాత వర్తించునటుల గనపట్టదు. అటులయ్యు ప్రసిద్ధపురుషుల మనిపించుకొన్నవారే యీ న్యాయముపై నాధారపడి బోల్తాపడుచుండుట సామాన్యమైనది. ఒక్కవ్యక్తిని ఒక్కవిషయమును పరిశీలించి యా దేశము జాతి యట్టిదేయను వారీ తరగతిలోనివారు. ప్రతిదేశమందును జాతియందును మంచిచెడ్డ లుండకమానవు. అట్లు లేకుండువనుకొనుట ప్రకృతిని యవగాహనము చేసికొనకుండుటగును. మంచిచెడ్డలుండకతీరవని గుర్తించిన విశాలహృదయము మంచిని గమనించునుకాని రంధ్రాన్వేషణము చేయదు. కొన్ని సంవత్సరముల క్రితము భారతదేశమునందు పర్యటనము గావించి విపరీతపువ్రాతలనువ్రాసిన మేయో కన్యకట్టి విశాలహృదయములేదు. ఆమె వ్రాతలను స్వదేశీయులును విదేశీయులును పూర్తిగా ఖండించి భారతదేశమందలి పవిత్రతను గను భాగ్యమామెకు లేకపోయినదనియు, నందలి చెడుగును గుర్తించు దురదృష్టము మాత్రము పట్టినదనియు నామెను గర్హించిరి. కాని యిట్టి మనస్తత్వము గల వారి కిట్టి పాఠము లుపయోగించునటుల గనపడవు. బేడన్ పావెల్ గారిదియంతయు నెరుగనివారు కారు.

వీరు 1908 వ సంవత్సరమున బాలభట సంస్థను స్థాపించి ప్రఖ్యాతిజెందినవారు. వీరిటీవల హిందూదేశమున బర్యటనముగావించివెడలిరి. తన దేశమును చేరిరో లేదో హిందూదేశమునుగూర్చి హిందీ భాషయందు గౌరవమను పదము లేదనియు, హిందూయువక ప్రపంచమున శీలము కానరాదనియు వాకొనినట్లు వార్తాపత్రికలు ప్రకటించినవి. దీనికి వారే యనుభవమును బట్టి నుడివిరో చెప్పుటకు వీలులేదు. ఇందు సత్యమునకంటె వారి సంకుచితాశయ మెక్కుడుగనున్నదని నిస్సందేహముగ జెప్పవచ్చును. వారు హిందూదేశమున బర్యటనము గావించిన స్వల్పకాలములో బాలభటుల మధ్యనే గడపిరి. ఆ యనుభవము వలననే వారిట్టి నిర్ణయమునకు వచ్చియుందురని యనుకొనుటకు బాలభటులు వారు స్థాపించిన సూత్రములపై వృద్ధిపొందినవారే గదా! అపుడు వారి సూత్రములే యిట్టివనవలయునా? లేక పావెల్ వంటి పాశ్చాత్యుల సంపర్కమే వారి నిట్టిస్థితికి దీసికొని వచ్చినదనవలయునా? లేక పారతంత్ర్యమున బడి మ్రగ్గుచున్న భారతదేశమును అధికారమున్నవారిష్టమువచ్చినటుల అనుట పరిపాటియా?

దివ్యజ్ఞానసమాజాధ్యక్షులగు అరుండేల్ గారు బేడన్ గారిని పై నిందావాక్యములు సత్యములాయని కనుగొంటిమనియు 'భార

తీయులందరు శీలములేనివారని తా ననలేదని వారు దానికి ప్రత్యుత్తరమిచ్చిరనియు ప్రకటించియున్నారు. బేడర్ గారి అఘటనాఘటనచాతురికి మెచ్చుకొనవలసియున్నది. వా రిపుడే తమ యభిప్రాయము సత్యదూరమని కొంతవఱకైన దెలిసికొనినందులకు సంతసము గలుగుచున్నది.

* * *

ఉదకమండల మహిళాసభ

అఖిలభారతమహిళాసభవారి యాజమాన్యమున ఉదకమండలములో మేనెల 15వ తేది గాల్ సతిగారి యధ్యక్షతక్రింద పై సభ జరిగెను. ఈసభనుగూర్చిన వివరములిదివఱకే పెక్కుమారులు గృహలక్ష్మి ప్రకటించియుండుటచే పాఠకులకీ సభావృత్తాంతము క్రొత్తదిగాదు. అఖిలభారతదేశమున నీసభకు 137 పెద్దనియోజకవర్గములున్నవని దెలియవచ్చుచున్నది. ఇపు డిట్టి నియోజకవర్గము లింకను యభివృద్ధిజేసి మహిళాసంఘములు స్థాపించుటకై వేతనముపై నొక మహిళామణి నేర్పాటుజేయ నుద్దేశించియున్నామని శ్రీమతి కజిన్సుగారీ సభాముఖమున దెలిపియుండిరి. ఇది సంతసింపదగిన విషయము. ఈ మహిళాసభవారు పెద్దపెద్ద సమస్యాపరిష్కారములకు పాటుబడుచున్నారనుట నిజమే గాని గ్రామములందు స్త్రీలు బాగుపడుట కెక్కువగ ప్రయత్నింపవలసిన యావశ్యత గలదు. ఈ సభాశయములు గ్రామముల మధ్యగూడ వ్యాపించి స్త్రీలందర ర్థము జేసికొన్నచో, సంవత్సరములనుండి పరిష్కారము గాకయున్న సమస్యలు తీర్మానమైయుండును.

ఈ సభయందు విదేశీయ సోదరీమణుల సంఖ్య నానాటి కెక్కువయగుచుండుట సోదరత్వ మెక్కువై యంతర్జాతీయ సఖ్యతకు దారిజూపుచున్నది. భారతీయ స్త్రీల దుస్థితియెఱిగి వా రీ సభలమూలమున నెంతయో పరిశ్రమజేయుటకు బూనుకొనుచుండగా, నీ దేశముననే బుట్టి నిరంతరానుభవముచే స్త్రీల కష్టసుఖముల నెఱిగిన మనము మహిళాభివృద్ధి కెంతేని జేయగలము గదా! విద్యావతులై వారి సోదరుల కష్టముల నెఱిగినవారెల్ల ముందంజవైచి యీపని యెందులకు జేయకూడదు?

* * *

క్రొత్తపట్టణము - వేసవిపాఠశాల

ఒంగోలుసమీపమునగల క్రొత్తపట్టణమున నెలకొల్పబడిన వేసవి రాజకీయపాఠశాల యక్రమసమావేశమని ప్రభుత్వము నిషేధపు టుత్తరువును ప్రకటించిరి. ఇరువదినాలుగుగంటలలో నా రాజకీయపాఠశాల మూయవలయుననియు, నందలి విద్యార్థులెల్ల వెడలిపోవలెననియు నుత్తరువులు గావించినందున నందలి విద్యార్థులు చాలమంది యిరువదియొకటవ తేదీన ఒంగోలునకు వెళ్లిరి. వారిలో 52మంది విద్యార్థులును 7 గురు విద్యార్థినులును నిషేధపుటుత్తరువు నుల్లంఘించు దలంపుతో నచట సమావేశ

మైరి. అచటికివచ్చిన పోలీసుదళము వెంటనే వారిలో ప్రముఖులను లాటీదెబ్బలకు గురిచేసి గుద్దుచు నీడ్చుచు లారీలవద్దకు త్రోయుచుండిరి. ఇంతలో జిల్లామేజస్ట్రీటు అచటికిరాగా దౌర్జన్యము లాగిపోయెను. అపుడు దరిని అరెస్టుగావించిరి. వారిలో పదినలుగురను మాత్రము లారీపై ఒంగోలుకు దీసికొనివెళ్లిరి. మిగిలిన 39 మంది విద్యార్థులను వట్టిపాదములతో పైన నీడ లేక పదుకొండుగంటలయెండలో నడిపించుకొనివెళ్లిరి. విద్యార్థినులను మధ్యాహ్నము ఒకటిరెండు గంటలమధ్య పైన కప్పులేని లారీలో ఒంగోలునకు దీసికొనిపోయిరి. ఆస్త్రీలలో నొకయామె చూలాలు; మరియొకయామె చంటిబిడ్డతో నుండెను. ఈ స్త్రీలవెంబడి పయనించిన పోలీసుదళము పైన కప్పుగల లారీలలోనే వచ్చిరి. ఇవి క్రొత్తపట్టణపు వేసవిపాఠశాలను గూర్చిన వార్తలు.

ఎట్టి దురుద్దేశమునులేక ప్రశాంతముగ నేటి రాజకీయసమస్యలను ప్రజాసముదాయమునకు దెలుపు దలంపుతో ప్రారంభింపబడిన పాఠశాల ప్రభుత్వపుదృష్టిలో నక్రమసంస్థ గావచ్చునుగాని శాసనోల్లంఘనము చేయుదలంపుతో నందుగుమిగూడిన విద్యార్థులను లాటీచార్జి చేయవలసినంత యావశ్యకత యేమిగలదు? అందు గుమిగూడిన వారల్లరిజేసి శాంతికి భంగము గలిగింపలేదు; నూతన రాజ్యాంగ ప్రణాళిక ప్రకార మిట్టిశిక్షలు శాసనోల్లంఘనకు విధింపబడినవా? అయితే జిల్లామేజస్ట్రీటు అరుదెంచుటతో నవి యాగిపోనేల? అనగా పోలీసుదళము తాముచేసిన లాటీచార్జి తమయధికారుల దృష్టికుండే దోషమని గమనించిరా? అరెస్టుగావించిన తరువాత ప్రశాంతముగ నుండువారి నంత నిష్కరుణాగ బాధించుటెందులకు? నిప్పులు గురియు గుంటూరుమండలమున మంటల చెరగు మధ్యాహ్నకాలమున క్రిందనుపైనను మండిపోవుచుండ మైళ్లకొలదిదూరము నడిపించుటయు, గర్భవతులను చంటిశిశువుల తల్లులతోగూడిన స్త్రీలను పైకప్పులేని లారీలందు గొనిపోవుటయు నెంతయు విచారకరముగ నున్నది.

ఈసంఘటన ప్రజలయం దెంతయో సంచనలము గలిగించినదనకతప్పదు. నూతన రాజ్యాంగ సంస్కరణములు మునుపటికంటె నెక్కువస్వాతంత్ర్యము నొసగుచున్నవని 'సార్వభౌముల ప్రభుత్వము తిన్నగా సాగిపోవుట'కు ప్రయత్నించుచున్నామని మురియుచున్న తాత్కాలిక మంత్రివర్గము పై సంఘటనను స్వాతంత్ర్యసూచకమనియు, ప్రభుత్వము తిన్నగా సాగుటకొక నిదర్శనమనియు నంగీకరించునా? లేక మాకు దీనితో సంబంధములేదని మూరుమొగము పెట్టునా?

ప్రభుత్వమువారు మాత్రము క్రొత్తపట్టణమున లాటీచార్జి నిజముకాదనియు, నెవరికి బలమైన గాయములు తగలలేదనియు,

అవసరమైన బలమునే నుపయోగింపబడె ననియు ప్రకటించుచున్నారు! ఇందలి సత్య మెవరెఱుగరు?

* * *

శ్రీమతి కాళ్ళకూరి మహాలక్ష్మి సుందరమ్మ గారు, బి.ఎ. ఆనర్సు

ఒకరు ఒకానొక గొప్ప తత్వవేత్తను 'అన్నిటికంటెను సులభమైన దెయ్యది?' అని ప్రశ్నించిరట. దాని కాతడు 'ఇతరులకు సలహానిచ్చుట' యని ప్రత్యుత్తర మిచ్చెనట. దేశాభివృద్ధికని సంఘాభివృద్ధికని నిరంతర ముపన్యాసముల గ్రుక్క తిరుగక యిచ్చువారే తా మావిధముగ వర్తింప వెనుదీయుచుందురు. తా మితరులకు చెప్పిన రీతిగనే చేయుట మిగుల గొప్పతనము. ముప్పది సంవత్సరములకు పైగా స్త్రీల యభివృద్ధికై పాటుపడు బాలాంత్రపు సుందరరామయ్య, శేషమ్మ దంపతులం దీ గుణముప్రస్ఫుటము. వారు స్త్రీల కందరకు విద్య అత్యవసరమని చాటుటయేగాక తమ యేకపుత్రికయగు మహాలక్ష్మిసుందరమ్మగారిని బి.ఎ. ఆనర్సువఱకు చదివించిరి. మహాలక్ష్మిసుందరమ్మగారి భర్తయు వారితో నీవిషయమున నేకీభవించి తమ పత్ని విద్యావిషయమున దోడ్పడిరి. విద్య అత్యవసరమని అందరంగీకరించి దాని నేర్పింప పట్టుబట్టుచో తప్పక కొనసాగగలదనియు, గృహస్థాశ్రమమునమండియు విద్యావిధానము నిరంతరాయముగ కొనసాగింపవచ్చుననియు కాళ్లకూరి మహాలక్ష్మిసుందరమ్మగారు నిరూపించిరి. వీరెల్లపుడు పరమాత్ముని సహాయముతో తమ సోదరీమణుల యభివృద్ధికి తలిదండ్రులవలె పాటుబడుచు నాదర్శప్రాయులై యుందురుగాక.

---

EDITED, PRINTED AND PUBLISHED BY
DR. K. N. KESARI AT THE LODHRA PRESS, EGMORE, MADRAS.

## బర్మా చందాదారులకు గమనిక

1937 వ సం. ఏప్రిల్ నెల మొదలు తేదీనుండి పోస్టల్ రేట్లు ఎక్కువ చేయబడినవి గాన బర్మా చందాదారులకు 'గృహలక్ష్మి' సంవత్సరము చందా 4-8-0, విడిప్రతి 0-6-0 అనియు మనవి చేయుచున్నాము.

మేనేజరు, గృహలక్ష్మి.

# ప్రసవకాలమును దెలుపు పట్టిక.

సాధారణముగ స్త్రీలు గర్భము ధరించిన 280 దినములకు ప్రసవించెదరు. కడపటి బహిష్ఠయైన మొదటిదినము మొదలు లెక్కపెట్టుకొనవలయును. క్రిందకనుబరచిన పట్టిక మొదటిపంక్తి జనవరి 1.వ తారీఖున గర్భము ధరించినయెడల రెండవపంక్తి అక్టోబరు 8-వ తారీఖున ప్రసవించెదరు.

| | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| జనవరి | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | జనవరి |
| అక్టోబరు | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | నవంబరు |
| ఫిబ్రవరి | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | | | | ఫిబ్రవరి |
| నవంబరు | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 1 | 2 | 3 | 4 | 5 | | | | డిసంబరు |
| మార్చి | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | మార్చి |
| డిసంబరు | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 33 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | జనవరి |
| ఏప్రెల్ | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | | ఏప్రెలు |
| జనవరి | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | | ఫిబ్రవరి |
| మే | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | మే |
| ఫిబ్రవరి | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | మార్చి |
| జూను | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | | జూను |
| మార్చి | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | | ఏప్రెలు |
| జూలై | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | జూలై |
| ఏప్రెల్ | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 23 | 29 | 30 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | మే |
| ఆగస్టు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | ఆగస్టు |
| మే | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | జూను |
| సెప్టంబరు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | | సెప్టంబరు |
| జూను | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | | జూలై |
| అక్టోబరు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | అక్టోబరు |
| జూలై | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | ఆగస్టు |
| నవంబరు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | | నవంబరు |
| ఆగస్టు | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | | సెప్టంబరు |
| డిసంబరు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | డిసంబరు |

## ఈశ్వర సం॥ర వైశాఖ జ్యేష్ఠములు

1937 సం॥ జూన్ నెల

1 స॥ మం సా6-25 ధఉ9-31 వసా4-41 మొ6-17కు భో6-24
2 అ॥ బు సా5-25 శత ఉ9-25 వసా3-42 మొ5-16కు భో6-20
3 న॥ గు సా4-5 పూభా ఉ9-0 వసా6-15 మొ7-47కు భో6-16
4 ద॥ శు సా2-21 ఉభాఉ8-8 వరా7-32 మొ9-3కు భో6-12 తిథిద్వయం
5 ఏ॥ శ ప12-18 రేఉ6-57 వరా12-46 మొ2-16కు భో6-8 ద్వాదశితిథి
6 ద్వా॥ ఆ ఉ9-55 అశ్వఉ5-32 భర తె3-58 వసా2-30 మొ4-0కు భో6-4
7 త్ర॥ సో ఉ7-40 చతు తె5-15 కృరా[illegible]-17 వసా3-7 మొ4-36కు భో6-0
8 అమా॥ ● మం రా2-43 రోరా12-37 వసా5-10 మొ6-39కు భో5-56
9 శు పా॥ బు రా12-22 మృరా11-3 వఉ5-51 మొ7-21కు భో[illegible]-52
10 వి॥ గు రా9-46 ఆర్ద్రరా9-38 వఉ6-57 మొ8-27కు భో5-48
11 త॥ శు రా[illegible]-13 పునరా8-28 వఉ8-59 మొ10-[illegible]0కు వతె4-10 మొ భో5-44
12 చ॥ శ సా6-37 పుష్యరా7-40 లేవ5-45కు భో5-40
13 పం॥ ఆ సా5-22 ఆశ్లేరా7-11 వసా4-12 మొ5-56కు
14 ష॥ సో సా4-35 మఘరా7-11 వఉ7-11 మొ8-47తె
15 స॥ మం సా4-13 పుబ్బరా7-36 వరా2-2 మొ3-42కు మి భో7-42
16 అ॥ బు సా4-25 ఉత్తరరా8-35 వర్జ్యంలేదు భో7-38
17 న॥ గు సా5-5 హరా19-13 వఉ5-29 మొ7-11కు భో7-34
18 ద॥ శు సా6-16 చిత్తరా11-56 వఉ6-39 మొ8-23కు భో7-30
19 ఏ॥ శ రా7-48 స్వారా2-11 వఉ6-27 మొ8-1 కు భో7-25
20 ద్వా॥ ఆ రా9-30 విశా తె4-44 వఉ8-23 మొ10-9కు భో7-21
21 త్ర॥ సో రా11-40 అనూ పూర్తి వఉ9-10 మొ10-56కు భో7-17
22 చతు॥ మం రా1-41 అనూఉ7-23 వప1-34 మొ3-20కు భో7-13
23 పూ ○ బు రా3-31 జ్యేఉ9-55 వసా6-40 మొ8-25కు భో7-8
24 బ పా॥ గు తె4-59 మూప12-15 వఉ10-29 మొ12-24కు వరా10-37 మొ12-21కు భో7-4
25 వి॥ శు పూర్తి పూషా ప2-13 వరా10-42 మొ12-22కు భో7-0
26 వి॥ శ ఉ5-57 ఉషాప3-44 వరా7-53 మొ9-13కు భో6-56
27 త॥ ఆ ఉ6-29 శ్రసా4-47 వరా8-52 మొ9-30కు భో6-51
28 చ॥ సో ఉ6-33 ధసా5-19 వరా12-31 మొ2-7కు భో6-46
29 పం॥ మం ఉ6-4 షష్ఠి తె5-15 శతసా5-23 వరా11-40 మొ1-14కు 6-42
30 ష॥ బు తె3-49 పూభాసా4-59 వరా2-16 మొ3-49కు భో6-38